పశువైద్య గ్రంథమాల 10 వ పుష్పము

# ప శు జా తు లు.

గ్రంథకర్త:

"అభినవ సహదేవ" ఆయుర్వేద పశువైద్యాచార్య, వైద్యకళా విభూషణ, పశువైద్యగ్రంథమాల, ఆయుర్వేద పశుచికిత్సాలయ సంస్థాపకులు, ఆంధ్ర జాతీయ పశువైద్య విద్యాపీఠ ప్రెసిడెంటు, ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలప్రిన్సిపాల్ నగు,

డాక్టర్ యేజెళ్ల శ్రీరాములు చౌదరి,

A. V. L. M. & S., A. M. B. & B.S.

అంగలూరు, కృష్ణాజిల్లా.



1937

 [వెల రు 0-8-0.

D



గ్రంథకర్త:
"అభినవసహదేవ"
యేజెళ్ల శ్రీరాములుచౌదరి

# విజ్ఞప్తి

నేను సుమారు పదిసంవత్సరములకిృందట ఆయుర్వేద పశుచికిత్సాలయమును ఆయుర్వేద పశువైద్య గ్రంథమాలను స్థాపించి అనుభవపూర్వకముగా నపుడపుడు పశువైద్య గ్రంథముల బ్రకటించుచు వార్తాపత్రికలలో వ్యాసములువ్రాయుచు నా శక్తికొలది పశుసేవ చేయుచున్నసంగతి తామెల్లరకును దెలిసియేయున్నది. నేను వ్రాసిన గ్రంథములనుబట్టియు, నా యొద్ద తరిబియతయిన వైద్యులద్వారాను, కరపత్రముల మూలకముగను ఆంధ్రదేశమందంతటను ఆయుర్వేద పశువైద్యమును వ్యాపింపజేసితిని.

మరియొక ముఖ్యవిషయమేమన నేనిపుడొక ఆంధ్రజాతీయ పశువైద్య కళాశాలను స్థాపించి గవర్నమెంటువారిచే రిజిష్టరు చేయించి యనేకమంది పశువైద్యులను తరిబియతు చేయుచున్నాడను. ఈకళాశాల ప్రభుత్వమువారివలన ద్వరలో రికగ్నైజు కానున్నది.

ప్రస్తుత కాలపరిస్థితులనుబట్టి రైతులకును విద్యార్థులకును తదితరులకును అర్థమగునటుల సులభశైలియందు ఇరువది పశువైద్య గ్రంథములను మాపశువైద్య గ్రంథమాలతరఫున బ్రకటించితిని. మా యాయుర్వేద పశువైద్య గ్రంథమాలయందు వెల్వడిన గ్రంథరాజములందిదియు నొక్కటి. ఇయ్యది

పశుధనాభిమానులగు హైందవులకెల్లరకును హస్తభూషణమని చెప్పనగును.

మా యీగ్రంథములపై గవర్నమెంటు వెటరినరీ, అగ్రికల్చరల్, రెవిన్యూ, ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులయందలి ప్రముఖులగు నుద్యోగులును తదితర డిపార్టుమెంటులవారును జమీందారులు భూస్వాములు మున్నగు వారు పెక్కురు పెక్కు సదభిప్రాయముల నొసంగియున్నారలు.

మా యీ గ్రంథముల నాంధ్రలోకమాదరించి ప్రతి పాఠశాలయందును, ప్రతిపుస్తక భాండాగారమందును, కోఆపరేటివు సొసైటీలయందును ఉంచి మాపశువైద్య గ్రంథమాల నభివృద్ధికి దెత్తురని విశ్వసించుచున్నారము.

ఈ గ్రంథమునకు దయతో పీఠిక వ్రాసి వన్నె దెచ్చిన పశుధనాభిమాన శిరోమణికిని ముద్దులొలుకునటు లీ గ్రంథమును త్వరలో ముద్రింపించి యిచ్చిన గ్రంథాలయప్రెస్సు మానేజరు శ్రీ కుందా లక్ష్మీనరసయ్యగారికిని, నా యీ గ్రంథ రచనమునకు సాయపడిన గ్రంథముల రచయితలకును నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాడను.

ఇట్లు,

గ్రంథకర్త.

# పశు జాతులు

## భారతదేశములోని పశువులు (The cattle of India)

భారతజాతీయ నిర్మాణమున రాజ్యాంగ సమస్యలే మొన్న మొన్నటి వరకు మిక్కిలి ప్రాముఖ్యము వహించినవి గాని సాంఘికసమస్య లంత ప్రాముఖ్యము వహించి యుండలే దనువిషయ మెల్ల రెరింగినదే. కాని సంఘసంస్కరణము, రాజకీయము గ భారతదేశమున మోక్షము లేదను విషయము భారత జాతీయ నాయకుల మనముల నాక్రమించినది మొదలు భారత దేశమున సంఘ సంస్కరణము, గ్రామ పునర్నిర్మాణ మును ముందుకు వచ్చినవి. సంఘసంస్కర్తలే గాక రాజకీయ నాయకులును, సంఘ సంస్కరణోద్యమ ప్రాముఖ్యమును నేడు గుర్తెరుగుట శుభావహము. అయినను ఈసంఘ సంస్కరణము ఎంతదనుక పోవలెనో అంతదనుక పోకున్నది. భారత దేశము నకు తీరని కళంకమై యున్న అస్పృశ్యతా నివారణ సమస్య మహాత్మునివలన ప్రాముఖ్యము వహించి హరిజనోద్యమ మతిశీఘ్రముగా సాగుచున్నదిగాని తదితర విషయములందు హిందూసంఘమున సంస్కరణము వరిముల్లువాసియైనను మొగ్గ చూపుటలేదు. సంఘ సంస్కరణము నెడలగల ఈ కొద్దిపాటి సుముఖతయు నగరములయందును, పట్టణముల యందును, సుముఖతకు బదులు విముఖతయే పెచ్చు పెరుగు పరిస్థితులు ద్యోతక మగుచున్నవి. భారతజాతీయ నిర్మాణమునకు పల్లెటూరు పట్టుకొమ్మయను విషయము అతిశయోక్తి గాజాలదు.

సంస్కరణోద్యమము పట్టణముల యందును నగరములయందును సాగించి విజయులమైతిమని సంతోషించుటకంటె ఆభాసము వేరులేదు. సంఘసంస్కరణోద్యమమును పల్లెటూళ్లయందు సాగించి గ్రామ పునర్నిర్మాణమునకు సహాయులైననచో తాముచేసినకృషి సఫలీకృతమైనదను సంతోషము ప్రతివారును కాంచగలుగుదురు. ఈగ్రామ పునర్నిర్మాణోద్యమ విధానమనుమహావృక్షము వివిధశాఖోపేతమైఅలరారుచున్నది. ఈశాఖలు నాలుగుదిశలందును వ్యాపించి కుసుమఫలభరితమై జంపముగపెరిగి వివిధపక్షిసంతతులకును విశ్వమానవకోటికిని చల్లని ఆశ్రియము నొసంగ జాలినపుడె దానిజీవితము మహోపకారియై సార్థక మైనట్లు భావించుచున్నాము. ఒకవైపుననే వృక్షము పెరిగి ఇతరదిశలయందు క్షీణించుచున్న పక్షమున జూచుట కావృక్ష మసహ్యముగా నుండుటయేగాక ఆవృద్ధిని మనము సంపూర్ణమైనదానిగా భావింపము. అట్టి వృద్ధివలన సార్థక మిసుమంతయు గలుగదు.

## పల్లెటూళ్లు (Villages)

భారత జాతీయ నిర్మాణమునకు పల్లెటూరు పట్టుగొమ్మ యంటిమి. రైతు అట్టిపల్లెటూరునకు ప్రాణమువంటివాడు. రైతుక్షేమమే పల్లెటూరిక్షేమము. రైతులభివృద్ధియే పల్లెటూరియభివృద్ధి. రైతుక్షీణతయే పల్లెటూరిక్షీణదశ. పల్లెటూరు క్షీణించిన దనినచో భారతదేశము క్షీణించినది. భారతదేశము క్షీణించినదనిన భారతజాతి నశించినట్లు. జాతి

రూపుమాసిపోయిన జాతీయసంబంధమగు విజ్ఞానము, నాగరికత, ఔన్నత్యము, వేయేల? సమస్తము నశించినట్లె.

## ఆర్థిక పరిస్థితులు (Economic policy)

భారత జాతీయ నిర్మాణమునకును సౌభాగ్యమునకును భారత దేశమందలి రైతుయొక్క ప్రస్తుత స్థితిని విచారించి ఆర్థిక రాజకీయ సాంఘిక సారస్వతాది విషయములం దధఃపతితుడై యున్న రైతును పునరుద్ధరించుటయే ప్రథమమున భారత జాతీయ నాయకులు నిర్వర్తింపవలసినవిషయము. నేడు భారత దేశముననేగాక ప్రపంచమందంతటను ఆర్థికపరిస్థితులు తారుమారైనవి. అందు ముఖ్యముగ రైతుస్థితి గరళము మ్రింగినవానిపోలికగానున్నది. రైతుస్థితిని విచారించువారేలేరు. ఒకవేళ విచారించినను మనకేలయని మిన్నకుండువారేగాని నేడు భారత దేశమున రైతుజీవితమును అసహ్యముగను దుఃఖ భాజనముగను చేయుచున్న సమస్యల నెదుర్కొని ఆర్థిక వేత్తలతో సంప్రదించి నివారణోపాయముల కనిపెట్టి రైతు ప్రజల యందు యథేచ్ఛగ వ్యాపింపసమకట్టిన భారతజాతీయవేత్తలు అరుదనిచెప్ప సాహసింప వలసినందులకు విచారముగనున్నది. ఒకేగ్రామముననున్న రైతుస్థితి మరియొక రైతునకు తెలియని పరిస్థితులయందున్న మనరైతులకు విదేశములందున్న ఆర్థిక సాంఘిక రాజకీయ నైతిక సారస్వతాభివృద్ధులును స్థితిగతులును ఎట్లు తెలియును? పాపము! అసలే భారతదేశమునందు విద్య తక్కువ. నాగరికతయందు ప్రాముఖ్యము వహించుచున్న ఇతర దేశములందు ఎందరు చదువనువ్రాయను రానివా

రున్నారో, అందరేకదా మనదేశమున చదువనువ్రాయను ఎరింగినవారు. భారతదేశముయొక్క శోచనీయస్థితి ఈ ఒక్క విషయమును బట్టియే గ్రహింపనగును. ఒకరిద్దరకు తెలిసికొనవలెనని కుతూహలమున్నను ఈ దేశమున తగిన సదుపాయములు సున్న.

నేటి రాజకీయసాంఘిక పరిస్థితులయందు రైతుజీవితము నెదుర్కొనుచున్న సమస్యలు చాలగలవు. మనదేశమున 35 కోట్ల ప్రజలలో నూటికి 80 వంతున వ్యవసాయమే జీవనోపాధిగా గలవారు. శాస్త్రవిజ్ఞాన సహాయమునను, నూతన పరికరములతోను వ్యవసాయము సాగించుచున్న జపాను అమెరికా ఇంగ్లండు మొదలగు దేశములయందలి రైతుస్థితికిని భారతదేశమందలి రైతుస్థితికిని చాల వ్యత్యాసముగలదు. అట్టి పరదేశములయందు రైతుల నెదుర్కొనుచున్న రాజకీయ సాంఘిక ఆర్థిక వైజ్ఞానికశీతోష్ణాదిపరిస్థితులు వేరు. భారతదేశపు రైతు నెదుర్కొనుచున్నపరిస్థితులు వేరు. మున్ముందు ఈ పరిస్థితులను విపులముగ చర్చింతుము.

## జంతువుల సహాయము.

ఆవిరిశక్తిసహాయముతో నడుపబడుచున్న యంత్రములును, నూతనవస్తుపరికరములును గాక వ్యవసాయమునకు ప్రత్యేకముగ సహాయకారులగుచున్న జంతువులయందును వాని నుపయోగించు పద్ధతులును వేరైయున్నవి. ఆ దేశములయందు గుఱ్ఱము కంచరగాడిద మొదలగు జంతువులు వ్యవసాయమునకు ముఖ్యముగ సాయపడుచున్నవి. భారతదేశమున

అట్టి స్థానమును ఎద్దు ఆక్రమించుచున్నది. పైన వివరింప బడిన కారణములేగాక తదితరములగు కారణములును పెక్కులు ద్యోతక మగుచున్నవి. ఆ దేశములయందు జెనెస్సీపద్ధతి యందుగల పద్ధతులను, సుఖమును బట్టి రాజకీయ చట్టనిర్మాణకులు వహించుబాధ్యతలను, వ్యవసాయమున కుపకరించునట్లు విభజింపబడిన భూఖండములును భారతదేశమున అవిభక్త కుటుంబమువలన కలిగిన మితిలేని భూవిభాగమును హిందూదేశపు మతసాంఘిక పరిస్థితులవలన కలిగిన ఆదాయభాగపు చట్టమున గల వ్యత్యాసములును, పద్ధతులును, ఋణమును, ఆ యా దేశములందు గల రైతుల స్థితియందలి వ్యత్యాసమునకు కారణములగుచున్నవి.

అమెరికా ఇంగ్లండు జపాను మొదలగు దేశములందు వ్యవసాయమునకు గుఱ్ఱము కంచరగాడిద ఎట్టి స్థానము వహించుచున్నవో అంతకంటె నెక్కువ స్థానమును భారతదేశ వ్యవసాయమున ఎద్దు ఆక్రమించుచున్న విషయము సత్యదూరముకాదు. కాన భారతదేశమున పశువులే ముఖ్యాధారము లగుచున్నవి. అట్టి పశువులస్థితి మన దేశమునందెట్లున్నదియు, ఎట్లుపకరించునదియు, ఒకవేళ క్షీణించుచున్నచో ఎట్లు వృద్ధికి తెచ్చునదియు పరిశ్రమచేసి విచారించి వారి విమర్శనఫలితములను వెల్లడించినవారు చాల అరుదు. రైతుస్థితిగతులను తెలుపు గ్రంథములే భారతదేశమునందు లేని ఈ స్థితిగతులలో పశువులనుగూర్చి తెలుపు గ్రంథములు అసలే లేవనిన అత్యుక్తిగాదు. ఆంగ్లమందైనను మొత్తమున

ఆర్థికమునుగూర్చి తెలుపు గ్రంథములు కలవేగాని ప్రత్యేకముగ రైతు ఆర్థికసాంఘిక రాజకీయనైతిక వైజ్ఞానిక విషయములను పరిస్థితులనుగూర్చి తెలుపు గ్రంథములు తక్కువ.

భారతదేశమున పశువులస్థితి పూర్వ మెట్లుండినదియు నే డెట్లున్నదియు తెలిసికొనవలెనను కుతూహలము ప్రతి రైతుహృదయమునందును జనింపకమానదు. వేయేల? గోవే తల్లిగా భావింపబడి పూజింపబడుచున్న భారతదేశమున నేటి పశువుల హీనస్థితి శోచనీయము. భారతదేశ వైశాల్య మెంతయో, వ్యవసాయానుకూల మెంతయో, భూభాగ మెంతయో, పశువులమేతకై పచ్చికబీళ్లక్రింద వదలవలసిన భాగమెంతయో, మనదేశమునగల పశువులెన్నియో, అందు వ్యవసాయమున కుపయోగపడుచున్న వెన్నియో, వ్యవసాయమున కెన్ని యవసరమో, ఆ పశువులలో ఎన్ని మేతలేక జీవచ్ఛవములై నిరుపయుక్తములై యున్నవో భారతదేశ ప్రజలు ఆరోగ్యవంతులై బలవంతులుగా నుండుటకు ఎన్ని పాడినిచ్చు పశువు లవసరమో, ఎన్ని ప్రస్తుతముకలవో, ఈ మొదలగు విషయములను లెక్కల మూలమున తెలిసికొనుట ప్రతి భారతీయునికర్తవ్యమై యున్నది. ఈ పై ప్రశ్నలనే మనము ఒక్కొకటిగ విచారించి విమర్శింతము.

## భారతదేశ వైశాల్యము

భారతదేశ వైశాల్యము 669.97 మిలియను (మిలియను= 10 లక్షలు) ఎకరముల చదరపుమైళ్లు. ఇందు సాగుచేయబడుచున్న భూభాగము; 33.5%. వ్యవసాయమునకు పనికిరాని

భూభాగము 35.5%. ప్రస్తుతము పచ్చికబైళ్ళక్రిందను, వ్యవసాయమునకు పనికివచ్చు పరిస్థితులయందుండియు సాగుచేయబడిన భాగము 30.8%. ఈ30.8 మూడవభాగము భూమియే సాగుబడిచేయుటవలన వ్యవసాయాభివృద్ధికి తోడ్పడగలదు. చెన్నరాష్ట్రమున 23.35 మిలియన్ల ఎకరములభూమి సాగుచేయుటకు పనికివచ్చు అనుకూల పరిస్థితులయందున్నది. మొదట విభజింపబడిన రాష్ట్రములయందు సాగుబడి భూమిలోనికి తెచ్చుటకువీలగుభూభాగముచాలతక్కువ. ఇట్టిపరిస్థితులు గతరాష్ట్రమునందు పొడసూపుచున్నవి. పంజాబురాష్ట్రమున యీభాగమునసీటిపారుదలసదుపాయమునుబట్టియుండును.ఆర్థికభౌతికపరిస్థితు లనుకూలముగ లేవు. కాని సుక్కూరు ఆనకట్ట పూర్తియైనందున కొన్నిలక్షల యకరములు సాగుబడిలోనికి వచ్చునని నిర్ధారణచేయబడినది. అస్సామున అనారోగ్యకరమగు శీతోష్ణాదిపరిస్థితులవలన అభివృద్ధికి చోటులేకున్నది.

గడచిన నలుబదిసంవత్సరములయందు 1908 మొదలు 1910-11 లోపున ఎక్కువ భూభాగము సాగుబడిలోనికి వచ్చినది. 199.71 మిలియనుల యకరములనుండి 223.06 మిలియనుల ఎకరములవరకు పెరిగినది. అప్పటినుండి 1927-28 వరకు సాగుబడిలోనికి పెచ్చువచ్చిన భూభాగము చాల తక్కువ.

## భారతదేశమునందలి పశువుల సంఖ్య

1924-25 సంవత్సరమున బ్రిటిష్ఇండియా లెక్కలను బట్టి తయారుచేయబడినది.

| రాష్ట్రము | పశువుల సంఖ్య |
| --- | --- |
| అస్సాం | 5,785,000 |
| బెంగాలు | 25,491,000 |
| బీహారు, ఒరిస్సా | 20,728,000 |
| బొంబాయి | 8,480,000 |
| సింధు | 2,326,000 |
| బర్మా | 6,267,000 |
| మధ్యపరగణాలు | 11,671,000 |
| మద్రాసు | 22,111,000 |
| పంజాబు | 15,237,000 |
| సంయుక్తరాష్ట్రములు | 31,046,000 |
| బ్రిటిష్యిండియా మొత్తము | 150,978,000 |

1930 వ సంవత్సరములో 146958583 పశువులు గలవు.

1935 వ సంవత్సరములో నీదిగువసంఖ్య గలదు.

| | |
| --- | --- |
| గోజాతి | 16447360 |
| దున్నలు | 5993414 |
| గొఱ్ఱెలు | 12864343 |
| మేకలు | 7406018 |

| | |
|---|---|
| గుఱ్ఱములు | 129759 |
| కంచరగాడిదలు | 765 |
| గాడిదలు | 131104 |

## డైరీ పరిశ్రమ

హిందూ దేశమునందలి లైవ్ స్టాకులో పశువు లతిప్రాముఖ్యమును వహించుచున్నవి. సాగుబడి కావశ్యకమగు మోటివ్ పవర్ నంతను పశువులే సహాయముచేయుచున్నవి. పొలముల కుపయోగించు ఎరువు పశువులవలననే లభ్యమగుచున్నది. మనుష్యుల రాకపోకలకు వ్యవసాయపరికరములను పంటలను ధాన్యములను పొలములనుండి మార్కెట్టులకు గొంపోవుటకును భారత దేశమున డైరీపరిశ్రమను అభివృద్ధిపరచుటకును, పాలను యిచ్చుటకునుపశువులే ముఖ్యాధారములు. పశువులపరిస్థితులు తృప్తికరముగ లేని యెడల పశువు లెక్కువగ వ్యవసాయమునకు కావలసియుండును. పశుసంఖ్య ఎక్కువైన కొలదియు వాటిపరిస్థితులు సంతృప్తికరములుగనుండవు. కాన నేడు భారతీయులచే సంతృప్తికరముగ పోషింపబడనట్టియు, శక్తి లేనట్టియు పశువులు మిక్కుటముగనున్నవి. మన దేశమున పశువులసంఖ్య ఎక్కువగ నున్నను వ్యవసాయమునకు పనికివచ్చు పశువుల సంఖ్య చాలతక్కువ.

భారత దేశము సాగుబడి చేయుచున్న 100 యకరముల భూమికి 67 వంతున పశువులుగలవు. హాలెండులో 38 పశువులుమాత్రమేగలవు. హిందూ దేశమున 67 పశువులు మేయుచున్న మేతనే హాలెండులో 38 పశువులు మేయుచున్న వన్న

హాలెండు పశువులు బలముగలిగి వ్యవసాయమునకు పనికి వచ్చు స్థితియందున్నవని తేటపడుచున్నది. హిందూదేశ వ్యవసాయాభివృద్ధి పశువులపైననే ఆధారపడియున్నదను విషయమంతగ పరిగణింపబడకున్నది. కాన భారతదేశమున వ్యవసాయాభివృద్ధి చేయవలెననిన పశువుల యభివృద్ధికై పాటుపడవలెను.

## పశుజాతుల యభివృద్ధి

పశుజాతులయభివృద్ధికై భారతదేశమున ఎక్కువ శ్రద్ధ తీసికొనబడుటలేదు. ఇట్టి అశ్రద్ధకు చాలకారణములు కనబడుచున్నవి. పశుజాతులయభివృద్ధి కలుగవలయునన్న ఆబోతు శ్రేష్ఠమైన జాతికి చెందినదై మిక్కిలి బలముగలదై యుండవలెను. భారతదేశమున పూర్వము గోజాతివృద్ధికై ఆబోతులయెడ చాల జాగ్రత్త తీసికొనుచుండెడివారు. ప్రతి పల్లెటూరియందును ఒక్కొక ఆబోతు వదలివేయబడుచుండెడిది. ఆబోతు పోషణార్థమై గ్రామమునకు బీడువదలివేయబడును. ప్రతిగృహస్థుడును తన ధర్మముగ భావించి ఆబోతునకు తవుడుచిట్టుఉలవ గుగ్గిళ్లు మొదలగుపదార్థములను పెట్టుచుండెడివాడు. నేడుభారతదేశమున ఒక్కొక పరగణాకైనను శ్రేష్ఠమైనఆబోతు లేదు. తప్పుసుళ్లుగలిగి సాంప్రదాయమంతయు నశించి బలహీనమై పోవుచున్నది. కావున ఆబోతువిషయమై ఎంత జాగ్రత్తపడవలయునో, ఎంత శ్రద్ధ చూపవలయునో వెల్లడియగుచున్నది. అందుకొరకే వ్యవసాయ పరిశోధన సామ్రాజ్య సంఘము యొక్క పశుకృషిశాఖానిపుణుడగు కల్నల్ ఎ. ఆల్వరుగారు

పశుసమృద్ధినిగూర్చి తెలిపిరి. ఇంతియేగాక ఢిల్లీరాష్ట్రిమం దలి పశువులను అభివృద్ధిపరచు నుద్దేశముతో ఇటీవల రాజ ప్రతినిధిగారు మూడుమంచిఎద్దులను యిచ్చియుండిరి. మరియు ఇండియా దేశమందంతటను ఆబోతు లత్యావసరమను యుద్దేశ్య ముతో ఆయాడిపార్టుమెంటులవారితో అన్ని ప్రాంతములందును ప్రచారము గావించుచున్నారు.

## ప్రసిద్ధికెక్కిన జాతులు

ఈక్రింద వివరింపబడిన జాతు లాయారాష్ట్రముల యందుప్రసిద్ధికెక్కినవి. పశుజాతులనుగూర్చి మున్ముందు విస్త రముగా తెలుపబడినది. ఈదిగువమాత్రము క్లుప్తముగా వివ రించుచున్నాను. సింధుదేశమున తార్‌పార్కర్ సింధు అను జాతులును, గుజరాతుదేశమున కాంక్రీజ్ అనుజాతియు, కతియవార్ ప్రాంతములందు గిర్ అనుజాతియు, చెన్నరాష్ట్ర మున ఒంగోలుజాతివియు శ్రేష్ఠములైనవి. కంగాయం, అల్లం బాడి అనుజాతులుకూడ పైజాతులవలననే ప్రసిద్ధికెక్కినవి.

పశువులు అందు ముఖ్యముగ ఎద్దుజాతిని అభివృద్ధిపరచ వలయునన్న ఆయారాష్ట్రములయందున్న మంచి ఆబోతు లతో బలముగల గోవులను కలుపవలయును. దీనినే క్రాస్ బ్రీడిం (Cross Breeding) గందురు. అందువలన ఆయా జాతులయందు పూర్వముకన్న ప్రత్యేక గుణములు కన బడవు. ఆబోతులుగా వదలివేయబడు కోడెలకు తప్ప మిగత కోడెలకన్నిటికి విచ్చులు తీయించవలెను. గుజరాతుప్రాంత ములయందును, పాశ్చాత్య దేశములయందును నిర్మింపబడిన

పరిశోధనాలయములను అన్ని ప్రాంతములందును నిర్మించ వలయును. జమీందారులు, పెద్దపెద్ద రైతులు అత్యధిక శ్రద్ధ వహింపవలెను. కేంద్ర రాష్ట్రీయ ప్రభుత్వములును ఈ విష యమున వ్యవసాయదారులకు మిక్కిలిగ తోడ్పడవలయును. లాగుడుపనులకు, పాలకునుపయోగింపబడు పశుజాతిని అభివృద్ధి జేయుటకై కేంద్రరాష్ట్రీయప్రభుత్వములపక్షమున వ్యవసాయ శాఖవారు కృషి సలుపవలయును. వారు ప్రస్తుతము చేయు చున్న పని సంపూర్ణముగ లేదు. పాలకు, లాగుడునకు కంగాయం అను జాతి అభివృద్ధిలోనికి తీసికొని రాబడినది. బెంగుళూరు జాతియు, కంగాయం జాతియు, సింధు, పంజాబు జాతులును స్కాట్లండు దేశపుజాతితో కలుపుటవలన కలిగినవి. కోయంబ త్తూరు జాతి స్వదేశిజాతుల సంపర్కమువలన కలిగిన దే. స్వచ్ఛ మైన సింధుజాతి పశువులును, ఆంధ్రదేశమున ప్రసిద్ధికెక్కిన ఒంగోలు జాతియు పెంపబడుచున్నవి.

## సంవత్సరాదాయము

మన హిందూదేశములోని పశువుల మూలముగ వార్షిక ఆదాయము 1900 కోట్ల రూపాయలని మిగుల జాగ్ర త్తగా తయారుచేయబడిన లెక్కలు తెలిపినవి. పాలు పెరుగు మొదలగువానివలన 810 కోట్లును, వ్యవసాయ పశువుల పనులవలన 612 కోట్లును, ఎరువులవలన 270 కోట్లును, వ్యవ సాయేతర పనులవలన 161 కోట్లును, తోళ్ళు చర్మము ఉన్ని మాంసములవలన 45 కోట్లునని 1929 వ సంవత్సరపు లెక్కల వలన తెలియుచున్నది. ఇప్పుడు సుమారు 33% ఆ ఆదాయ

ములోనుండి పడిపోయినది. కాని తగ్గుధరలు యేర్పడి యుండి నను హిందూ దేశపు పశువుల యొక్కయు, వాని ఫలితము యొక్కయు యేటేట లభించుఆదాయము కనీసము 1250 కోట్లను మించియేయున్నది. పాలు పెరుగు వెన్న మొదలగు నవి చేయబడెడు పరిశ్రమలవలన మాత్రము 540 కోట్లు ప్రతి సంవత్సరము లభించుచున్నది.

---

# భారతదేశములోని పశుజాతులు

## అమృతమహాల్ జాతి (Amrutamahal breed)

మైసూరులోనున్న జాతులన్నిటిలోను ఈ జాతియే ప్రసిద్ధికెక్కినది. ఈ జాతిని మూడు భాగములుగ విభజించ వచ్చును. హాళకర్, హగల్వాడి, చిత్రలదుర్గ అనునవి. ఆ యా జిల్లాలనుండి వచ్చినవిగాన ఆ యా పేర్లు వచ్చినవి. మన దేశములో నీ జాతి యెక్కడనున్నను వెంటనే గుర్తింప వచ్చును. ప్రస్తుతమున్న అమృతమహాల్ జాతి కలగలపుగా నున్నది. పూర్వము హళ్లికారులను గొల్లజాతి ఉత్తరదిక్కున నుండి దక్షిణభాగమునకువచ్చి చిత్రలదుర్గులోను, తూం కూరులోను తమజాతిపశువులతో నివాస మేర్పరచుకొనిరి. ఈ పశుజాతినే అమృతమహాల్ జాతి యందురు.

## ఒడ్వాయరుప్రభువు, హైదరాలీ

పూర్వము తత్ప్రదేశ ప్రభువులలో నొకడగు దేవ రాజఒడయార్ అను ప్రభువు పశువులయందుండు ఆసక్తిచే ప్రత్యేకముగా వానికొక పశువులకొట్టము నిర్మించెను. ఇంకను వానిఅభివృద్ధినిగూర్చి మిగుల జాగ్రత్తగా నుండెడివాడట. వానిపాలు మొదలగువాని గృహనిర్వాహకులకు నుపయోగించు కొను చుండెడివాడట. ఈ పశువులను పెంచుటకూడ రాజకీయములలో నొకముఖ్యసమస్యయై యున్నది. మొట్టమొదట పశువులకు ముద్రవేయుట నారంభించినది ఈ ప్రభువే. ఈ రాజుపేరే ప్రత్యేకముగా బ్లాకు చెక్కించి ముద్రించెడి వాడట. మైసూరురాజ్యము బలవంతముగ హైదరాలీ వశ పరచుకొనినపుడు ఆ ప్రభుత్వముయొక్క శ్రేష్ఠమైన పశు సంతతినిగూడ గైకొనెను. అట్లు గైకొన్న పశువులలో ముఖ్య మైనవి చిత్రాలదుర్గులోని పాల్లెగా రనునవి. హైదరాలీ రాజ్యసంబంధ విషయములలో యుద్ధసమయములందు తమ పశువులనుగూడ నుపయోగించెను. తన రాజ్యములో 60 వేల ఎద్దులను తయారుచేయించెను కాని ఈ ప్రభువుఆపశువులయం దంత శ్రద్ధవహింపలేదు. కుమారుడు టిప్పుసుల్తానుమాత్రము ఈ జాతిని తనకున్న పశువులతో చేర్చి తన తండ్రికన్న మిక్కిలి జాగ్రత్తగా కాపాడెను.

## టిప్పుసుల్తాను (Tippu Sultan)

చిక్కదేవరాజ ఒడ్వాయరు ప్రభువు అమృతమహాల్ జాతి పశువులకు పెట్టిన "బిన్నిచావది" అను పేరునకు బదు

లుగా టిప్పుసుల్తాను "అమృత"మను పేరుగమార్చెను. టిప్పుసుల్తాను ఈ పశుసంతతినిగూర్చి మిగుల జాగ్రత్తతీసికొని ఒక ప్రత్యేక సంస్థగా నేర్పరచెను. బ్రిటీషువారు మైసూరునకు ముఖ్యపట్టణమగు శ్రీరంగపట్టణమును వశపరచుకొనిన తరువాతకూడ తద్విధమున అతిజాగ్రత్తగా సంరక్షించిరి. అమిాల్దారులు, ఉద్యోగస్థులు, చిన్నకోడెదూడల నభివృద్ధికి దెచ్చుటయు, జాగ్రత్తగ పెంచుటయు వారియొక్కవిధియైయున్నది. ఆ చిన్న కోడెదూడలు ప్రభుత్వ శాసనప్రకారము ఎట్టి పంటలోనైనను స్వేచ్ఛగా విహరించుటకు స్వతంత్రమియ్యబడెను.

ఎద్దులు మూడుభాగములుగ విభజింపబడెను

(1) దుక్కిటెద్దులు.

(2) యుద్ధసమయములందు తుపాకులు, మరఫిరంగులు మోయు ఎద్దులు.

(3) విలాసార్థమై యుంచబడిన ఎద్దులు.

ప్రతి సంవత్సరము పశుసంతతినిగూర్చి సంవత్సరపు లెక్కలు రాజకీయముగ ప్రకటింపబడు చుండెడివి. టిప్పుసుల్తాను ప్రభువైయున్న కాలమున తాను స్వయముగ పశువులను ఆయా లెక్కలను పరీక్షించి అతి జాగ్రత్తగా పెంచిన వారికి బహుమతులిచ్చి పశుసంతానమును వృద్ధిపరచెను. ఈ రీతిగా చిక్కదేవరాజ ఒడ్వాయర్ ప్రభువుతో ఉన్నత దశకు వచ్చిన పశువులే ఈ అమృతమహల్ జాతియైయున్నవి.

ఇట్టి సుప్రసిద్ధ జాతిపశువుల సహాయమువలననే హైదరాలీ బ్రిటిష్ ప్రభుత్వముమీదికి యుద్ధమునకు పోవు సమయమున నూరుమైళ్లదూరమున రెండుదినములలో తన యుద్ధ సామగ్రి నంతను గొనిపోజాలెను. హైదరాలీ పశువుల సహాయముచేతనే తాను ఓడిపోయినప్పుడెల్ల శత్రుముఖము నుండి తన యుద్ధసామగ్రిని అతిత్వరితముగా శత్రువుల కందకుండ తొలగించెడివాడు. ఇట్టి పశుసంతతిని బ్రిటిషుప్రభువులు హైదరాలీతనయుడగు టిప్పుసుల్తాను నోడించి తాము వశపరచుకొనినపుడు వానియొక్కప్రసిద్ధిని, గొప్పతనమునుగూర్చి ఆశ్చర్య మొందిరి.

## కాప్టెన్ డేవిడ్సన్ (Captain Davidson)

బ్రిటిష్ సేనానియగు కాప్టెన్ డేవిడ్సన్‌గారు ఈ జాతి పశువులనుగూర్చి ఈవిధముగా పొగడిరి. బొంబాయి సేనల ననుసరించి ఆఫ్గన్‌స్థానమునకు బోయినపుడు మైసూరు సేనతో బోయిన 230 మైసూరెద్దులతో సమానముగ యుద్ధసామగ్రిని ఈడ్చుకొనిపోగలిగినఎద్దులు మరి యేసేనవెంటగూడ లేవు. అట్లున్నను సాటిరావు. ఈ సేనలు ఆఫ్గన్‌స్థానమునుండి మరల తిరిగివచ్చుచు బొంబాయి పార్కులో విడచినపుడు ఆ ప్రదేశము, ఆ పరిసరప్రాంతములుగూడ ప్రఖ్యాతివహించిన ఎద్దులను చూచుటకు వచ్చిన జనులతో క్రిక్కిరిసిపోయెను. ఈ ఎద్దులు విశ్రాంతిలేక 16 గంటలు వరుసగా మెడమీద కాడి తీయకుండ బరువులాగెను. బెంగాలు సేనలో ఉన్నటువంటియు, ప్రభుత్వపుసొత్తయినటువంటియు ఎద్దులు

చాలనున్నను మైసూరెద్దులంత అందమైనవి బలమైనవి ఓర్పు గలవిగా నుండవు.

విల్లింగ్డన్‌ప్రభువు, మైసూరుకమీషనర్ (Lord Willingdon)

కొన్నికొన్ని యితరయుద్ధ దిగ్విజయములు ప్రత్యేకముగా అమృతమహల్‌జాతిసహాయమువలననే కలిగినవి. అయిపురములో జరిగిన ద్వీపకల్పయుద్ధసమయమునందు ఇంగ్లీషు సేనానియగు విల్లింగ్డన్ ప్రభువు ఈ క్రిందివిధముగా చెప్పెను: ఈ సమయమునందు నాకు అమృతమహల్ పశువుల సహాయమున్నయెడల నెంత బాగుండునో యని పశ్చాత్తాపపడెను. 1808 వ సంవత్సరములో మైసూరు కమీషనరు ఈ క్రింది విధముగ అభిప్రాయపడెను:—

అమృతమహల్‌జాతిపశువులు మిక్కిలి చురుకుదనము, బలము కలిగి సేనలకన్న అతిత్వరితముగా నడువ శక్తి గలిగియుండెడివి. అరేబియా గుఱ్ఱములు తదితరజాతి గుఱ్ఱములకంటె ఎంత ఘనతవహించినవో, అట్లే అమృతమహల్ పశువులు అన్నిజాతులకంటె అగ్రస్థానము వహించినవి. మైసూరుముఖ్యపట్టణమగు శ్రీరంగ పట్టణము బ్రిటిష్ ప్రభుత్వవశమైనపుడు వారా పశుసంతతిని వశపరచుకొనిరనియు, పిమ్మట తమకు కావలసినపుడు కొన్ని ఎద్దులను సహాయముచేయు షరతుమీద ఆపశువులను మైసూరు మహారాజునకు వశపరచిరి. టిప్పుసుల్తాను బ్రిటిష్ ప్రభువుల వశమైనప్పటికంటె ఆపశుసంతతిని ప్రత్యేక జాగ్రత్తతో చూచి యుద్ధసమయమునందు వానిసహాయముమీద కొంత ఆధార

పడియుండిరి. తరువాత బ్రిటిష్ ప్రభువుల అధికారమందున్న పుడు పశువుల యభివృద్ధికై నియమింపబడిన యుద్యోగులు వానినంత జాగ్రత్తగా చూడనందున ప్రాముఖ్యము తగ్గిపోయి నది. తత్కారణమున ఆంగ్లేయ ప్రభుత్వపు ఆశలన్నియు నిరాశలాయెను. ఆకారణమువలన ఈ జాతిపశువులు రాను రాను క్షీణదశ నొందుచు ఆంగ్లేయ ప్రభుత్వాధికారములో నికి వచ్చిన పదమూడు సంవత్సరములకు వాటియొక్క ప్రాము ఖ్యత పూర్తిగా నశించెను.

## మైసూరు ప్రభుత్వము (Mysore Government)

ఈజాతిపశువులు 1813 వ సంవత్సరములో మైసూరు ప్రభుత్వమువారు బీళ్లతోసహా మదరాసు సేనయొక్క భోజన సామగ్రిని జాగ్రత్తపెట్టెడు ఉద్యోగస్థుడగు కాప్టెన్ హార్వే గారి వశము నొనర్చిరి. అప్పుడీసముదాయము పది సంవత్సర ములలోనే మిగుల జాగ్రత్త తీసికొనుటవలన రెట్టింపు పశువు లాయెను. 1840 వ సంవత్సరములో మైసూరు మహారాజు పశువుల గుంపులను వానికిజెందిన బీళ్ళను బ్రిటిష్‌ప్రభుత్వము నకు జెందిన అదేజాతి పశుసముదాయమును కలిపి మైసూరు కమీషనర్ వారి స్వాధీనమాయెను. 1860 వ సంవత్సరములో మైసూరు ప్రభుత్వప్రతినిధియాజ్ఞవలన ఆ పశువులయం దజాగ్రత్తప్రబలుటయు, మీదుమిక్కిలి వానిని అమ్మివేయు టయుగూడ గలిగెను. తరువాత వారికే ఆపనిచేయుట తప్పుగా కనబడెను. వానినమ్మటవలన ఫలితము ప్రజాసామాన్యము నకు ప్రభుత్వమునకు గూడ మిక్కిలి నష్టముగలిగెను. తరు

వాత మైసూరు మహారాజుసహాయముచేత పశుసంతానాభివృద్ధిని గూర్చి మిక్కిలిజాగ్రత్తపడెను. మరల కొంతధనము హెచ్చించి అమృతమహల్ జాతి ఎద్దులను, ఆవులను మైసూరు దేశమంతయు విసుగు విరామము లేక వెదకి వానిలో శ్రేష్ఠమైనవానిని మాత్రము తీసికొని ఆజాతిని పెంపొందింప మొదలిడిరి.

మద్రాసు, ప్రభుత్వము (Madras Government)

అదేసమయమునందు మద్రాసు ప్రభుత్వము కూడ కన్ను తెరచి కొంతధనము హెచ్చించి మంచి సాంప్రదాయములగు 4000 ఆవులను 100 శ్రేష్ఠమైన కోడెలను, 1870 వ సం॥లో కొనిరి. 1833 వ సంవత్సరములో బ్రిటిష్ ప్రభుత్వము ఈ పశువులనన్నిటిని మైసూరు మహారాజునకు 2 లక్షల 25 వేలరూపాయల కమ్మిరి. మైసూరుమహారాజు వానియందుండు ప్రీతిచే అదేసమయముగ నెంచి, వానికి వలయుధనము హెచ్చించి, తగిన శ్రద్ధను జూపి వానియభివృద్ధికి మిక్కిలి పా[illegible] పడెను. తుదకీజాతిని పూర్వపుజాతిపశువుల స్థితికిగూడ [illegible] లిగెను. పశుశాలలనుగురించి కొన్నిపుస్తకములను పెట్టి వా[illegible]లో పశువులనన్నిటిని గూర్చి విపులముగా వ్రాయబడెను. వానికి గూడ జననమరణములు అతిజాగ్రత్తగా వ్రాయబడి, ప్రతి మాసమున్ను రిపోర్టుల ప్రకటించెడివారు. పశువు[illegible]ను మేపు వారిఅజాగ్రత్త, వారిదొంగలెక్కలు జాగ్రత్తగా [illegible]రీక్షించుచుండెడివారు. మద్రాసు ప్రభుత్వమునకు ప్రతి సంవత్సరము ఈజాతినుండి మైసూరుప్రభుత్వమువారు 200 ఎ[illegible]ద్దులను మాత్ర

మిచ్చెడివారు. ఇతరు లెవరైన ఆజాతిపశువులు కావలెనని కోరిన యెడల మైసూరు, బెంగుళూరు ప్రభుత్వసేనాధికారుల అనుమతితో బడసెడివారు. ఒక్కొక పశువుఖరీదు నూరు రూపాయలుండెడివి. మైసూరుప్రభుత్వమువారే దేశములో ఆర్థికక్లిష్ట పరిస్థితులు సంభవించినపుడు తమ పశువుల నమ్మిన ఆరు సంవత్సరముల తరువాత మైసూరు మహారాజు మరల వానియభివృద్ధికి గడంగెను. కొంతమంది ప్రత్యేకోద్యోగులును మైసూరు దేశమంతయు తిరిగి ప్రత్యేకముగ అమృతమహాల్ జాతికి జెందిన ఆవులను, ఎద్దులను కొనుటకు నియమింపబడిరి. కాని వారు అట్లుగాక ఆజాతిలోనే కొన్నిరకములగు హల్లికర్ హగల్‌వడి చిత్రాలదుర్గ మొదలగు అన్నిరకపు పశువులను కలిపి కొనుటచే మంచి అమృతమహాల్ జాతి పశువులు దొరుకుట కష్టము.

## అమృతమహాల్ జాతి పశువులు (Amritamahal)

ఈజాతిపశువులు క్రొత్తమనుష్యులను చూచినపుడు కోపించి మీదకు దూకును. వానిని సాధుత్వములోనికి దెచ్చుటకు కొన్నిమాసములు పట్టును. వానిని మచ్చికజేసికొనుటకు కొన్నిదినములవరకు ఆహారము పెట్టక పోయినయెడల అతిబలహీనస్థితికి వచ్చి చెప్పినట్లు వినును. వానిచే యెప్పుడును మంచి బరువులను లాగించుచు బాగుగా పనిచేయించుచుండిననేగాని అవి అంకెకు రావు.

ఆవులుకూడ ఎద్దులైనంత ప్రశస్తమైనవికావు. కారణమేమన, అవి అంతగా పాలిచ్చునవిగావు. అవియిచ్చుపాలు

వానిదూడలకేచాలును. కాని గృహకృత్యములకెంతమాత్రము పనికిరాజాలవు. మంచిఆవుఐనయెడల పూటకు సేరుపాలు యిచ్చును పాలుమాత్రము అతిశ్రేష్ఠముగను తీపిగను యుండును. మైసూరుజిల్లాలోనున్న ఈజాతిఆవులు తొలికాన్పు ఆరుసంవత్సరముల వయస్సున ఈనును. దూడలను పగటివేళ స్వేచ్ఛగా వానితల్లుల దగ్గరనే వదలిపెట్టి రాత్రిపూట మాత్రమే వేరుగనుంచి కాపాడుదురు. వానికి మూడుమాసములు వచ్చినతరువాత మిక్కిలి జాగ్రత్తగా పెంచుచు మంచిమంచి చేళ్లలోనికి వదలిపెట్టుదురు.

## మైసూరుజాతి (Mysore breed)

మదరాసు రాజధాని మొత్తముమీద ఈ జాతి మిగుల ప్రసిద్ధిగాంచినది. ఈజాతికిని ఒంగోలుజాతికిని దగ్గరపోలిక యుండును. ఈజాతిని ప్రతిపల్లెటూరు రైతులును సర్దారులకొరకు పనులకొరకు తెప్పించుచుందురు. ఈపశువులను చూచుటకు అన్నిదేశములనుండి ప్రతి సంవత్సరము జరుగు మైసూరు మహారాజావారి దసరాయుత్సవములకు పోవుచుందురు. ఈ పశువులు చిన్నవిగను, పలువిధరంగులతోడను యుండును. వ్యవసాయదారులు ఈ పశువులమీదనే ఆధారపడియుందురు. మైసూరు జాతిని "నాతుదాన" యని ఆ యా ప్రాంతముల వారు పిలచుదురు. రెండవజాతిని "దద్దోదనా" యని యందురు. అనగా పెద్దపశువనియర్థము. కాని ఇవి అంతయెక్కువగా దొరకవు. అట్లుదొరకినను యెక్కువ ఖరీదుండును. 'దద్దోదనా' 'నాతుదాన' యనునవి మైసూరుపదములు. దద్దోదనా అను

పశువు "అమృతమహల్, హల్లీకర్, చిత్రాలదుర్గ అనుబాండి మహాదేవర్ చెత్త" అను యితరపశుజాతులవలె నుండును. ఈ పశువులు ధనికులవద్దను, పెద్ద రైతులవద్దను కనబడును. కొంత మంది రైతులు ఈపశువ ర్తకముమీదనే జీవింతురు. చాల మంది ఆవులమందలను పశుసంతతికొరకు కొండలమీదను, తదితర ప్రాంతములకు తోలుకొనిపోయి మేపుచుందురు. ఒక సంవత్సర ప్రాంతపు దూడలను రైతులు ఆమందలనుండి విడదీసి అతిజాగ్రత్తతో రెండుమూడు సంవత్సరముల వరకు మేపి వానిని మంచిలాభములకు అమ్ముదురు. దద్దోదనాలను జాతి ఎద్దులలో శ్రేష్ఠమైనవానిని కొన్నిటిని తీసికొని తమ యింటివద్దనేయుంచి బాగుగ మేపుదురు. ఇంకను పంటలమీదను, బీడుభూములలోనికి, గోవులమందలలోనికి తోలి జాగ్రత్తగా మేపి ఆబోతులుగా తయారుజేసి వానిని మిక్కిలి పవిత్రవంతములుగా జూచుచుందురు.

## దద్దోదనాజాతి (Taddodana breed)

ఈజాతిదూడలను బాల్యమునందే రైతులు తదితర పశువులనుండి విడదీసి అతిజాగ్రత్తగా రెండుమూడు సంవత్సరములవరకు మేపి అమ్ముదురు. ఇవి సామాన్యముగా చాల బలము గలవిగను, మంచివిగనునుండును. ఈ జాతి ఆబోతుల నంత బలియునట్లుగా మేపరు. గ్రామములోనే అన్నిపశువులను, ఆబోతులను కలిపి మేతకుతోలుటచేత కల్తీసంతతిబుట్టును. ఒక్కొక్కప్పుడు రెండుమూడు గ్రామాదులవారు చందాలు వసూలుచేసి చిన్నదిగను, మంచిలక్షణములు కలదిగ నుండు

కోడెదూడను కొనెదరు. అది గ్రామధనమై గ్రామస్థులందరకు చేరినదై యుండును. దీనిని అన్ని పంటపొలములకు వదలి పెట్టి స్వేచ్ఛగా మేపుదురు. అది బాగుగా బలిసిన తరువాత ఆవుల మీదకు వదలిపెట్టుదురు. దద్దోదనాసంతతి ఆవుల నింటి వద్దనే యుంచి మేపుదురు గాన వానికి మంచిమంచిఆబోతులను సమకూర్చి మంచిసంతతులు కలుగునట్లు చేయుదురు. ఆబోతు నకు వృద్ధాప్యము రాగానే దానిస్థానమున మరియొక మంచి దూడను ఆబోతుగా జేసి విడచుదురు.

## మైసూరు జాతిఎద్దులు (Mysore Bulls)

అమృతమహల్ జాతి, ఈజాతిఎద్దులు మైసూరు దేశము లోనివే యగుటవలన మన హిందూదేశమునం దంతటను ప్రసిద్ధికెక్కినవి. అన్నిజిల్లాలవారు నిప్పుడిప్పుడే ధనవంతులలో కొందరు స్వారిచేయించుటకు, సర్దాకొరకు తీసికొని వచ్చు చున్నారు. ఈజాతిఎద్దులు దూరప్రయాణములకు బాగుగా పనికివచ్చును. దుక్కికిమాత్రము మంచివిగావు. విశేషమగు బరువులు లాగలేవు. "గాళ్లు" అనుపశురోగము తగిలినపుడు ఈ జాతిని జాగ్రత్తగా సంరక్షించుచుండవలెను. ఎందుచేతనన, సుకుమారజంతువు లగుటవలన చర్మము ఉడుకెత్తి కసిమిరి యను రోగము కలుగును.

## ఒంగోలు జాతి (Ongole breed)

ఈజాతిపశువులుకూడ ఇండియాలోనే గాక పరదేశ ములలోగూడ ప్రఖ్యాతిజెందినవి. మొదట నెల్లూరుజిల్లాలోని

ఉత్తరభాగపు తాలూకాలలోనే ఈపశువు లెక్కువగా నుండెడివి. ప్రస్తుతము ఆ తాలూకాలు గుంటూరు జిల్లాలో చేరిపోయినవి. వ్యవసాయమే ప్రధానవృత్తిగాలేని దేశములలో గూడ పశువులను జాగ్రత్తగా పెంచుదురు. అందువలన రైతు లెక్కువగా నీ పశుసంతానాభివృద్ధికై తమ కాలమును వ్యయపరచుచుండెడివారు. ప్రజలను బాగుగాకాపాడుచున్న ప్రభుత్వమున్నచోటికి పోయి వారు కాపురముండెడివారు. ఆపశువులను పెంచువారు ప్రభుత్వోద్యోగులవలన కష్టనష్టములకు వెఱచి వారి బారినుండి తప్పించుకొనుటకు తమపశుసంతతిని ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు మార్చుచుండెడివారు. వా రత్యంతభాగ్యవంతు లగుటచేత మిక్కిలి అందమైనటువంటి సుప్రసిద్ధమైనటువంటి పశువులను తమవద్ద నుంచుకొనుచుండెడివారు. తత్కారణమున ఒంగోలుప్రాంతములందు ఆసంతతియొక్క మంచిపశువులు ఇప్పటికిని దొరకును.

కారుమంచి, నిడమానూరు, పొందూరు, జయవరం, టంగుటూరు, కారవడి మొదలగు గ్రామములలో మిక్కిలి పశువులుదొరకును. మరియు వెలపలపదను, నెన్నూరుపాడు, మూసి నదీతీరమునందున్న పల్లెటూళ్లలోను, కందుకూరు తాలూకాలోనుగూడ నీజాతిలోని సుప్రసిద్ధమైన పశువులు దొరకును. దగ్గరమాగానిప్రదేశములలో నుండు, నెల్లూరు దక్షిణభాగములోనుండు పశువులు బహు తక్కువజాతివి. అంతియేగాక ఆ యా ప్రదేశములవారు పైప్రదేశమువారివలెగాక పశువులయందంత జాగ్రత్తవహింపక వానికి సరియైన పశుపోషణకూడ చేయరు.

## ఆ వు లు

ఆవులయొక్క పాలను దూడలకే వదలిపెట్టుదురు. మూడునాలుగుమాసములప్రాయము వచ్చినతరువాత ఆ దూడలకు పచ్చిగడ్డిగాని, ఉలవగుగ్గిళ్లనుగాని, చిట్టువగైరాలనుగాని మేపుదురు. అవి ఇంటిలోనిపిల్లలవలె గారాబముగా పెరుగుచుండును. ఆయాప్రదేశములకు పోయి చూడవలెననిన అవి బయటకురావు. ఆయారైతులు తమయిండ్లలోనే యుంచి మేపుదురు. ఈరీతిగాపెంచి ఎక్కువ ఖరీదులకమ్మెదరు. పాడివిలువనుబట్టి ఆవును అమ్ముదురు. ఆయావునుండి చాల నేతిని తయారుచేసి వర్తకులకు అమ్ముదురు. రైతులు మాత్రము తక్కువగ వాడుకొనుచు నేతిని అమ్ముకొను చుందురు. మంచి ఆవు 11 నుంచి 14 పౌనులవరకు పాల నిచ్చును. చూచుటకందముగనుండి కామధేనువాయన్నట్లు కన్పట్టుచుండును.

## బరువులు లాగుట

ఈ జాతి పశువులు మైసూరుజాతియంత అందముగ నుండకపోయినను, అంత వేగముగ నడువకపోయినను, ఎక్కువ బరువులు లాగుటలో నెమ్మదిగా లాగినప్పటికి అన్నిజాతుల పశువులను మించి అగ్రస్థానము వహించును. వానిని ప్రత్యేకముగా బరువులు లాగుటకే ఉపయోగించుదురు. చెన్నపట్టణములో 5 టన్నులవరకు బరువుగల సామానులను ఇవి లాగుచుండుట గాననగును. ప్రశస్తమైన పశుసంతతి ఇచ్చట గలుగుటకు కారణము అచ్చటనుండుబీళ్లైయున్నవి. 1857 వ

సంవత్సరమునకు ముందుకూడ వీనిమీద పన్ను వేసిరి. నెల్లూరులో మాత్రము వేయలేదు. సాగుచేయబడు భూములలో నూటికి 30 వ వంతు యితరభూమిని ప్రత్యేకముగా బీళ్లకు వదలిపెట్టుచుండెడివారు. ఆ బీళ్లలో ప్రతి గ్రామస్థుడు పెంచుటకు హక్కుండెడిది. 1858 వ సంవత్సరమువరకు పశుసంతానాభివృద్ధికి ఉత్సాహ మొసంగుటకు సాంవత్సరిక పశు ప్రదర్శనములు జరుగుచుండెడివి. అవి 1871 వరకుకూడ జరుగుచునే వచ్చినవి. ఈ 12 సంవత్సరములలోను 18 వేల రూపాయలు పశుప్రదర్శనములలో బహుమానములుగా పంచిపెట్టబడును.

## సింధుజాతి (Sindhu Breed)

ఈ జాతి పశువులు సింధుదేశమునందలి కరాచి, హైదరాబాదు పట్టణములందును, సింధునదిలోయలోను, విస్తారముగా గాననగును. ఇండియాలోనిపశుజాతులందు ఇది మిక్కిలి స్వచ్ఛమైనట్టియు, ప్రత్యేకలక్షణములను గలిగినట్టియు జాతులలో నొకటి. ఈ దేశమునగల పాడిపశువులజాతులలోనిది విస్తారముగా లభించుచున్నది. సింధుదేశమున ఈజాతిపశువులు పాడికేగాక పాటునకుకూడ ననుకూలించును. ఎద్దులు తదితర జాతులంత చురుకైనవి గాకపోయినను నిలుకడగా పనిచేయును. కరాచీకి వెలుపల నిది పాడిజాతిగనే పరిగణింపబడుచున్నది. ఆ పనికే దీనిని యభివృద్ధి చేయదగియున్నది. అనేక శతాబ్దముల నుండి ఈ పశువులు పెరుగుచుండిన ప్రదేశమున కితర ప్రదేశములతో నంబంధము లేకుండుటచేతనే ఈపశువులజాతి యింత

స్వచ్ఛముగ నున్నదని చెప్పవచ్చును. వానినివాసస్థానమునుండి తదితరచోట్లకు దీసికొనిపో ం ) వివిధపరిస్థితులయం దుంచినను అలవాటు పడుట ఈ జాతి ు సవుల మంచిలక్షణము.

## ఎగుమతియగుట

ఇసుకఎడారిలో పుట్టిపెరిగినను ఈజాతిపశువులు తేమగ నుండు రంగూనువంటి ప్రదేశములందుగూడ బాగుగా పెరుగు చున్నవి. స్వదేశమున నవి మేతకొరకు వెదకుకొనవలసియుం డును. ఇపుడు సింధుజాతిపశువులు మెసపొటోమియా, బర్మా, ఫార్మోజా, బెలూచిస్థానము, పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రము, మోరీసు, బోర్నియో, సింహళము మొదలగుప్రదేశముల కన్ని టికి ఎగుమతి యగుచున్నవి. మరియు నీదేశమునందలి మరి యేజాతిపశువులును ఇట్లు వివిధపరిస్థితుల కలవాటు పడగల వని చెప్పవలనుకాదు. అవి స్వతస్సిద్ధముగ కష్టమున కోర్చుట కలవాటుపడియున్నవి. అంటువ్యాధులు వాని కంతగాసోకవు. సింధుపశువుల సంగతిలో నితరజాతి లక్షణము లేవియు బయటపడకపోవుటచే నిది స్వచ్ఛమైన జాతిగ నెంచబడు చున్నది.

## కపిలియన్ జాతి (Capiliyan)

కంభంలోని కపిలియన్లు అను జాతి మనుష్యులు ఒక జాతి పశువులను పెంచుదురు. కపిలియన్లు పెంచుటచేతనే ఈ జాతికీపేరు వచ్చినది. ఈజాతి కన్నడజాతివారిసంతతియగుట చేత ఇప్పటికిని కన్నడభాషలోనే మాట్లాడుచుందురు. అవి చిన్నవిగను చురుకుగను ఉండును. మిక్కిలి ఓర్పుతో బండ్లు

లాగును. ఆజాతిమనుష్యులు ఆయాప్రాంతములకు వచ్చినపుడు తమవెంట నాపశువులను తీసికొనివచ్చితిమని చెప్పుదురు. ఆజాతి పశువులను వారు పవిత్రవంతమైనవని అర్థమువచ్చుఒకపదము చే పిలుచుదురు. ఆవులనుండి పాలుతీయరు వాని సంతానాభి వృద్ధికై పెంచుదురు. ఈజాతిపశువేదైన చచ్చినయెడల దాని పాతివేయుదురేగాని మాదిగవాని చర్మము నొలుచు కత్తికి గురికానీయరు. ఆపశుసమూహములోనున్న పెద్దపశువును పశురాజములేక పల్లదుపశువులని పిలుచుచుందురు. అది చని పోయినపుడు దానిస్థానే మరియొకదానిని గొప్పఉత్సవముతో నాపదవికి నెలకొల్పుదురు. ఆయుత్సవసమయమునందు ఆపశు జాతిసమూహమంతయు ఒకచోట కల్పించబడియుండును. చెర కుగడమోపులను వానిముందుయుంచి వాటిచుట్టును మూగి యుండిన ఆజాతిమనుష్యులు ఆపశుసముదాయములో నేదిముం దుగా ముట్టునోయని చూచుచుందురు. అట్లు మొదట సాహ సించి ఆచెరకుగడలను తినుదూడను ఆపశుసమూహమునకు రాజుగా జేసి దానికి కుంకుమపెట్టి పూలదండలతో నలంకరించుదురు.

## నందగోపాలస్వామి (Nanda gopalaswamy)

అట్లుచేసినప్పటినుండి దాని నందరు దైవసమానముగా నెంచుచు "నందగోపాలస్వామి" యనిపిలచుదురు. దానికొక ప్రత్యేక నౌకరొకనిని యేర్పాటుచేయుదురు. ఆనౌకరునకు కొన్నిపొలము లీనాముగనిత్తురు. అతనికిఆపశువురాజుగాచేయ బడకముందు జరుగుఉత్సవములో అచ్చటివారందరును మిక్కిలి

భక్తితో వేయునగలు రాగిడబ్బులు మొదలగు కానుక లన్నియుఅతడే గ్రహించును. ఈపశురాజులు అనేకమైనఅత్యాశ్చర్యమైనపనులు చేయును. అవిచేయుపనులనుగూర్చి ఇప్పటికిని అనేకమం దనేకరకములకధలు చెప్పుకొనుచుందురు. వేడిగాలిని పీల్చుటకై తాను రాజుగా చేయబడిన పశుసమూహమును తోలుకొని పోవుటకు ముందు పంచదారనుపాలను ఆపశురాజు ముందుపెట్టుదురు. ఆవస్తువులనది త్రాగి తలయూపినయెడల వారు చేయుపనికి నొప్పుకొనినట్లుభావించి వారు దానిని తోలుకొని పోవుదురు. దానిపోషణకై వినియోగింపబడిన నౌకరు ఒక ప్రత్యేక కులమునకు జెందినవాడై యుండును. అతడు చనిపోయినయెడల మరల నాకులమువారినే యెన్నుకొనుచుందురు. ఆనౌకరు తానొకపశురాజువలె సంచరించును. ఈపశురాజును ఎన్నుకొనిన తరువాత దానిచుట్టునున్నవారుచేయబోవు పూజకుముందు ఒకబాలకునకు దైవసంబంధమగు శక్తి పూని యెవడు దానికి నౌకరుగా నుండవలెనో వానిని చూపించును. ఈ కపిలయను జాతివారు ఆజాతిసభ్యులందరివద్దను పన్నువేసి పదునొకండువేలరూపాయలను పోగుజేసి రాతితో గదులు గదులుగనుండు ఒక పెద్దభవనమును కంభములతో నిర్మించి ఆపవిత్రవంతమగు పశుజాతి నివసించుటకుపయోగించిరి. పశువులబీళ్లలో మేసినందులకు యితర పశువులకు పన్నువిధించినట్లు వానికికూడ విధించినయెడల సాక్షాద్భగవంతునే మానవునితో సమానముగా వారుతలంచుదురు.

## తంజావూరుజాతి (Tanjore breed)

ఈజాతి పశువులు చెన్నరాజధానిలోనున్న అన్నిపశువులకంటెను మిక్కిలి వ్యత్యాసముగ నుండును. కారణమేమన, వానికొమ్ములు కోసివేసినందున బ్రిటీష్‌జాతి పశువులవలెనే యుండును. తంజావూరు గృహములలో ప్రత్యేకముగ మేపబడిన ఆవులసంతతి యగు దూడలను వానియజమానులే వానికి ఆరుమాసముల ప్రాయము వచ్చినప్పుడే కొమ్ములు కోసి వేయుదురు. ఆకోసివేయుటకు ఈక్రిందిపద్ధతి ననుసరించుదురు. కొన్నిటితోక వెంట్రుకలను తీసి వాటిని చెరకురసముతో గాని లేక పంచదారతోగాని కలిపి కొమ్ములపైన పూతపెట్టుదురు. అంతట యినుప కడ్డిని కాల్చి కొమ్ము పూర్తిగా కాలిపోవు వరకు ఆకడ్డీతో చుట్టును గీయుచుందురు. అట్లాకొమ్ము పూర్తిగా నశించువరకు రెండుమూడువారములుపట్టును. అట్లొకసారి కాల్చినపిమ్మట మరల వానిజన్మలో కొమ్ము లెంతమాత్రము పెరుగవు. తరువాత వానిచెవులను రెండంగుళములు కత్తిరించుదురు. అట్లుకొమ్ములను కాల్చనియెడల అవి మిక్కిలి పొగరుబోతులై మనుష్యులమీదకు వచ్చునని ఆపని చేయుదురు. అట్టిపని చేయుటవలన వాని సహజాకారమునందు పెద్ద మార్పుగలిగి అవి యొకక్రొత్తరకపు పశువులో యన్నట్లు తోచును. ఆకొమ్ములవిషయములోతప్ప తక్కినఅన్నివిషయముల లోను ఈతంజావూరు పశువులు కంగాయంజాతిని పోలియుండును.

## కోయంబత్తూరుజాతి (Koyambattore breed)

ఈజాతినే కంగాయంజాతియందురు. ఈజాతికంగనాడు, కొంగు, మరియు కంగాయం అని పిలువబడును. ఈపేరు కంగాయం తాలూకానుండి వచ్చినది. ఈపశుసంతతి కోయంబత్తూరు దక్షిణభాగములో నెక్కువగానుండును. ఇందులో పెద్ద చిన్న యను రెండురకములు గలవు. చిన్నజాతి కంగాయంలోను, ధరపురంలోను, ఉదమల్ పేట,పొల్లాకి, పల్లడం,మరియు ఎరోడా తాలూకాలలో నెక్కువగా దొరుకును. కంగాయంజాతి పశువులు శ్రేష్ఠమైనవి. ఆయాపశ్రదేశవాసులు వానిని తమభాగ్యములుగజూచుచుందురు. ఆపశ్రదేశమునం దచ్చటచ్చట ఒక్కొకరు 500 మొదలు 1000 పశువులవరకు కలిగియుందురు. సామాన్యముగ ప్రతిరైతును 10 మొదలు 20 వరకు పశువులను అమ్మకమునకై తనయొద్ద నుంచుకొనును. ఈ పశువులు సంతలలోనే గాక తదితర జిల్లాలనుండి బేరగాండ్రువచ్చి వానిని ఖరీదునకు తీసికొనిపోవుచుందురు.

### సం త లు

అవనాషి,మహదేశ్వరకొండ, మరియు మధుర మున్నగు ప్రాంతములలో ప్రతిసంవత్సరము పెట్టబడుపెద్దపెద్దసంతలలో ఈపశువులనమ్ముచుందురు. దక్షిణజిల్లాలలోనమ్మబడుపశువుల సంత లంత మంచివిగావు. కంగాయం తాలూకావారు మంచి మంచి పశువులను పరదేశముల కెంతమాత్రము ఎగుమతి చేయరు. ఆ ప్రాంతములలో కొనువారు పెద్దపశువులను కొనక చిన్న దూడలనే కొని బాగుగా పెరిగియున్న బీళ్లలోనికి

తోలుదురు. అట్లు మేపబడిన మంచి మంచి ఎద్దుల జతలు మధుర, తిరునల్వేలి జిల్లాలలో కంగాయం ప్రాంతములలోని కన్న ఎక్కువగా కన్పట్టును. గ్రామములో నున్న యితర పశువులతో సమానముగా ఈఎద్దులను మేపుదురు గాని వాని కొరకు ప్రత్యేకపుజాగ్రత్త వహింపరు. ప్రతిరైతుయొక్క పొలముచుట్టును (కోయంబత్తూరు జిల్లాలోమాత్రము) అల వలు అనగా దళ్లు ఎత్తుగా కట్టుదురు. ఈసరిహద్దులలోపలనే రైతు తన పశుసముదాయమునంతను నుంచుకొనును.

## మధురజాతి (Madhura breed)

ఈజాతి [illegible] లేక జెల్లీకట్, కిలాకడ్, కిల్ కట్ యనియందురు. ఈజాతిపశువులు చాలచిన్నవి. మధురజిల్లాలో చాలఎక్కువగా నున్నవి. కంభంప్రాంతమునందు గూడ నివి చాల గాననగును. మధురదగ్గర అయ్యంగోట్టాయమంజక్కారారు, అను పెద్ద ఒకడుగలడు. అతనికి వేయిపశువులు గలవు. వానిలో కొన్నిటిని 1907 వ సం॥లో మధురయొద్ద జరిగిన పశుప్రదర్శనములో ప్రదర్శించెను. వానికున్న కోడె దూడలు చిన్నవి. అందు మిక్కిలి బలముగలవిగను, లావుగల కాళ్లతోను, కఠినమైనపాదములతోను ఒప్పుచుండెను. భుజములు మెడ మొదలగు భాగములు మిక్కిలి శక్తివంతములై యుండి ఎటువంటి పనులకైనను బలము గలిగియుండెడివి. ఆ కోడె నొక్కొక్కదానిని నూరురూపాయలు చెప్పెను. కాని ఆరకపు పశువులు 35 లేక 50 రూపాయలకంటె నెక్కువ చేయనే చేయవు. ఈ జాతిపశువులు తదితర పశువులకంటె

పరిమాణములో చిన్నవిగాని పనియందుమాత్రము చురుకు దనము గలిగి అతిఓర్పుతో నుండును.

## పందెములు (Races)

మధుర పరిసరప్రాంతగ్రామములో ఈచిన్న కోడె లను పందెములకొరకై ప్రత్యేకముగా కొంతమంది రైతులు మేపుదురు. పందెములుజరుగునపుడు మిక్కిలి ముదురురంగుగల గుడ్డను కొమ్ములవద్దనుండి క్రిందివరకు కప్పుదురు. పోట్లాటలు ఈ క్రిందివిధముగ నుండును.

ఒకరంగుగుడ్డను కోడెయొక్కకొమ్ములచుట్టును గట్టిగ చుట్టి స్వేచ్ఛగా వదలిపెట్టుదురు. దాని నట్లు వదలిపెట్టినతరు వాత పలువురు మనుష్యులు పట్టుకొని పడవేసి దానివెనుక కాళ్లరెంటిని ఆగుడ్డతో కట్టుదురు. ఇట్టిది జరిగినపుడు పశువు ఒక్కొక్కప్పుడు విజృంభించుటచేత మనుష్యులకు గాయములు తగులుటయేగాక ఒక్కొక్కప్పుడుమరణములుకూడ సంభవించు చుండును. అంతఅపాయమైనఆట నందరు ప్రేమించుదురు. ఇట్టి పశువులను యజమాని ఇతర పశువులతో మేపక తానే స్వయముగా మేపుచుండును. తత్కారణమున ఇతరులను ఆ పశువు చూచినయెడల మీదకుదూకి పొడచును. ప్రత్యేక ముగా నిదేపనికొరకు ఒక్కొక గ్రామములో కొన్నివందల పశువులను మేపుదురు. దీనినిబట్టి ఆప్రాంతములవారికి అట్టి యాటలన్న ఎంత ప్రేమయో పాఠకులు గమనించుదురుగాక. పెద్దపశువులను ఎక్కువగా కోచిబండ్లు లాగుటకు నుపయోగించుదురు. అవి గంటకు 5 లేక 6 మైళ్లవేగమునపరుగిడును.

## తార్‌పార్కర్‌జాతి (Tarparkar breed)

ఇవి సింధుప్రాంతములందుగలవు. సహివల్‌జాతిని కొంచెము పోలియున్నను సింధుజాతికన్న కొంచెము పెద్దవిగ నుండును. ఇవి సాధువులైనవి. బూడిదరంగు తెలుపురంగు గలిగి యుండును. 750 నుంచి 950 పౌనులవరకు తూకము గలిగి యుండును. ఎద్దులు బరువులులాగును. 2½ సంవత్సరముల వయస్సు వచ్చినకడనుంచి పనిచేయించుచుందురు. ఈని పాలిచ్చుకాలము 270 దినములవరకుండును. ఒక ఈతకు 260 పౌనులనుండి 350 పౌనులవరకు పాలిచ్చును. ఈతకు మధ్య 100 దినములు వట్టిపోవును.

## బొంబాయిజాతి (Bombay breed)

ఈజాతిని గిరిలేక కతియవార్ అనియందురు. ఈజాతి బొంబాయిరాజధానిలో విశేషముగా గలదు. పంజాబునకు దక్షిణభాగములోకూడ యున్నది. ఈప్రాంతములందు పచ్చిక బయలెక్కువగా నుండును. ఈజాతి మిగుల పౌరుషవంతమైనది. క్రూరమృగములచేష్టలు గలిగియుండుటచేత రైతులు తమయిండ్లదగ్గరనుంచి చాలా జాగ్రత్తగా మేపుదురు. మంచి ఆబోతుతో సంపర్కము చేయించినచో ఆవులు మంచిసంతతి గలిగి పాలెక్కువ నిచ్చును. ఈజాతిలో నాలుగైదు ఆబోతులు చేరి భయంకరములగుసింహములను చంపివేయును. పూర్వము ఈజాతిఆబోతులు యుద్ధములం దుపయోగింపబడెడివి. దినమునకు 30 పౌనుల పాలు యిచ్చెడిఆవు అంబాల డైరీలో గలదు. కతియవార్‌లో ఈజాతిని ముఖ్యముగా పోషించు

మురు. కాంక్రిజుజాతి గుజరాతులోన అహమదాబాదు నకు మధ్యగా 50 మైళ్ళ చుట్టుప్రక్కలలోనున్న ప్రదేశముల లోను గలవు. ఈజాతి హాన్సిజాతిని పోలియుండును. ఇవి బరువులు లాగుటకు నుపయోగించును. తెలుపు, బూడిదవర్ణము గలిగియుండును. ఈ జాతి పరిశ్రమకు, వ్యవసాయమునకు ప్రఖ్యాతి జెందినవి.

## నాగపూరుజాతి (Nagapur breed)

ఈ జాతి ఢిల్లీప్రాంతములందునుంచి తేబడెను. నాగపూరు, ఉత్తర హిందూస్థానములయం దక్కడక్కడగూడ గలదు. మూపులకు బలహీనముగానుండును. గుబ్బమంత వడిగా పరుగెత్త గలవు. ఈజాతిఆవులు చాల మచ్చికగలవిగానుండును. ధనవంతులు ఈజాతిఎడ్లను బండ్లుకట్టి సర్దాగా షికార్లుచేయుచుందురు. వీనిరెండుకొమ్ములమధ్య ఉబ్బెత్తుగా నుండును. తోక పొడుగుగానుండి కుచ్చు నలుపురంగుగల వెండ్రుకలతో గుబురుగా నుండును. మూపురములు ఎత్తుగానుండి అందముగా నుండును. ఇవి 66 అంగుళముల యెత్తువరకు పెరుగును.

## గుంసూరుజాతి (Gunsoor breed)

గంజాంజిల్లాకు ఉత్తరభాగమునందు మాత్రము ఈ జాతిపశువులు కనబడును. ఇవి మిక్కిలి చురుకుదనము గలిగి పనిచేయును. బండ్లు లాగుట కెక్కువగా నుపయోగింతురు. గుంసూరు తాలూకాలోను, ఆయాప్రాంతములందును పచ్చిక బయళ్లెక్కువగా నుండును. కాని అవి యెంత మేసినను తదితర పశువులతో సమానములుగావు.

## బ్రాహ్మణజాతి (Brahmana breed)

బ్రాహ్మణపశువుయొక్క సాంప్రదాయము ఈవిధముగ నుండునని చెప్పుదురు. పూర్వ మొక హిందూరాజు ప్రయాణముచేయుచు మార్గమధ్యమున అజాగ్రత్తతో చూడబడు చున్న కోడెదూడలగుంపును జూచి సాక్షాత్తు భగవంతుడగు శివునియొక్క వాహనములగు నందులు ఇట్లజాగ్రత్తతో చూడబడుచున్నవిగదా యని మనస్సున నొచ్చుకొని అప్పటి నుండియు ఈక్రిందివిధమున చేయునట్లు ఆజ్ఞాపించెను. స్థితిపరు లందరును తమతమబంధువులుచనిపోయినపుడు ఆగ్రామములోని మంచి తెలుపురంగుగల కోడెదూడను వెదకి దానిని ఈశ్వ రార్పణముచేసి తమపరి దూడ స్వేచ్ఛగా నెటువంటి పొల ములలోనైనను, మేయుటకు అచ్చుపోసి ఆబోతులను విడచు చుండునట్లు ఏర్పాటుచేసిరి. కాని క్రమ క్రమమున దానియం దుండు భక్తి తగ్గి వీరైనంతతక్కువధరలో దొరకు నెట్టికోడె నైనను తీసికొనివచ్చి అట్లు ఆబోతులుగా చేయమొదలిడిరి. ఈ ఆచార మిప్పటికినిగలదు. దీనినె బ్రాహ్మణకోడెయందురు.

అచ్చుపోసి విడువబడు ఆబోతు సకలసల్లక్షణములు గలిగి ఉత్తమోత్తమమైన వృషభమై యుండవలెను. దీనిని గూర్చిన శాస్త్రసాంప్రదాయములు, భారతాది గ్రంథము లందును, సమస్తధర్మశాస్త్రములందును ఉండుటచేతను గ్రామములో చదువుకొన్న పురోహితుని అడిగిన ఆయన ప్రతిమనుష్యునకు దానిని పుస్తకములనుండి చెప్పును.

## పంజాబుజాతి (Punjab breed)

వీనినె సహివల్ జాతి లేక మాంటాగొమెరిజాతి యందురు. ఇవి పంజాబులోపుట్టి అమృతసర్, లైలాపూర్, లాహోరు, కానెవల్ మధ్యలోను పెంచబడుచున్నవి. ఈ జాతి పశువులు హిందూదేశములో నున్న జాతులన్నిటికంటెను చాల వన్నెకెక్కినవి. ఇక్కడ నుండుజాతి 1911 వ సంవత్సరములో కర్నల్ మెట్సన్ గారివలన స్థాపింపబడి పోషింపబడుచున్నవి. ఈయన అన్ని మిలిటరీడైరీలలోనున్న జాతులలో మంచి వాటిని పరీక్షించి తెప్పించెడివాడు. 1912 వ సంవత్సరములో ఈ పశువులు మేయు ప్రాంతములందు కాలువల కొలతలుత్రవ్వబడి పశువుల కనుకూలము లేకుండజేసి గోధుమలు, ప్రత్తివిత్తులు మొదలగునవి పండించుట మొదలిడిరి. ప్రస్తుతము గవర్నమెంటు ఫారములలో తప్ప ఈ జాతి పశువులు దొరకుట కష్టము. ఈ జాతిని పోషించుటకుగాను కొంతమందిరైతులకు పంజాబు గవర్నమెంటువారు కొన్ని భూములనిచ్చిరి. ఈ జాతి ఆవులు బాగుగా పాలిచ్చును. ఒక్కొక ఈతకు 7,10,16 వేల పౌనుల పాలిచ్చెడివి. ఒక్కొక ఈతకు 270 దినములవరకు సరాసరి లెక్కచూడగా పాలిచ్చెడి మంచి ఆవు 4500 పౌనులపాలనిచ్చెడిది. గిత్తలను 2½ లేక 3 సంవత్సరములమధ్య పనులను జేయించెడివారు. ఆవు నాలుగు సంవత్సరములలో నిచ్చెడిపాలు మంచివని తలంచుదురు.

## దున్నలు, గేదెలు (Buffalloes snd she - Buffalloes)

ఈజాతులు మనదేశమున కుత్తరభాగమున నున్నవి. హిమాలయపర్వత ప్రాంతములందును, అయోధ్య మొదలు భూటానువరకున్ను, వంగదేశము మొదలు పశ్చిమతీరమున నుండు తిరువాకోట్ వరకున్న దేశములోను, బ్రహ్మపుత్రానది వ్యాపించునంతవరకుండు దేశములోను, బర్మారాజ్యమునందును మిక్కుటముగా నున్నవి. గేదెలు మిక్కుటముగా పాలిచ్చును ప్రతిపల్లెటూరియందు నివి మిక్కుటముగా నున్నవి. దున్నలు బరువుగల బండ్లను లాగుటకును, భూములు దున్నుటకు వినియోగపడుచున్నవి. తెలుపుపశువులవలె నివి ఎండ తీక్షణమును భరింపజాలవు. గేదెలు శరదృతువునందు ప్రొర్లి వేసవికాలము సమీపించుసమయములో ఈనును. మచ్చికపడిన గేదెలు మూడు సంవత్సరములు వచ్చిన తరువాత దూడలను బెట్టుచుండును. గేదె సాధారణముగ ఎనిమిదిదూడలవరకు పెట్టును. సాంప్రదాయమును బట్టి కొన్ని గేదెలు ప్రతి సంవత్సరము ఈనును. తవుడు చిట్టు మున్నగు బలకరమగు వాతపదార్థములు ఎక్కువగా పెట్టుటవలన ఈనివత్సరలోనే వట్టిపోవుచున్నవి.

### రంగు

ఎద్దుల తరువాత దున్నలు పాటునకు పనికివచ్చుచున్నవి. మదరాసురాష్ట్రమం దంతటను ఇవి కొనవచ్చును. వానికి లావుగ పొడవుగ నుండుకొమ్ములు కలిగి వంకరతిరిగి అయిదారడుగుల పొడవు గలిగియుండును. రంగు సామాన్య

నలుపుగను లేక లేతనలుపురంగుగను యుండును. వెండ్రుకలు అరుదుగా నుండునుగాని ఒక్కొక భాగమందుమాత్రము వెండ్రుకల సమూహ ముండును. పల్లపుభూములు సాగున్నచోట వీనియొక్క యుపయోగము నెక్కువగా నుండును. అవి నెమ్మదిగ నడచినను పొలము దున్నుటలోను, చెరకుతోటలు దున్నుటలోను, తదితరపనులు చేయుటలోను మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి.

## రకములు

దక్షిణ ఇండియాలో నాలుగురకములు గలవు.

1. తోడాదున్నలు:—ఇవి నీలగిరిప్రాంతములం దుండును.
2. పర్లాకిమిడి దున్నలు:—ఇవి తూర్పుతీరముననున్న గంజాం జిల్లాలో దొరకును.
3. మలబారుదున్నలు:—ఇవి దక్షిణ కన్నడములో నెక్కువగా దొరకును.
4. ఇతర సామాన్య దున్నలు:—ఇవి అన్ని ప్రాంతములందు దొరకును.

## తోడాదున్నలు (Toda Buffalloes)

నీలగిరి కొండలకు పోవువారికందరకు ఈ దున్నలను గురించి తెలిసియేయుండును. అచటనుండు ప్రతి తోడావాడు ఒక మందను కలిగి యుండును. సామాన్యముగా నితరచోట్ల నుండువానికిని, వీనికిని చాలవ్యత్యాసముగలదు. ఈదున్నలు

తలవంచుకొని నడచును. అవిఅట్లు నడచునపుడు చూచినయెడల ఒక భయంకరమైన కుక్కవలె కనపడును. మెదటిభాగమందును, మెడభాగమందును, మూపురము, వెన్నుభాగములందును వెండ్రుకలు దట్టముగా పెరుగును. వానిని మనము అజాగ్రత్తగా సమీపించినయెడల అపాయము కలుగును.

## పగబట్టుట

అవి క్రొత్తమనుష్యులను చూడగనే తలపైకెత్తి కొంత దూరము వెనుకకు పరుగిడి మరల నిలబడి తానుచూచిన మనుష్యులవంక భయంకరముగ జూచుచు తలనుపైకెత్తుచు వెళ్లిపోయి ఇంక కొన్ని దున్నలను పోగుచేసికొని ఆమనిషిని పొడచుటకై దండెత్తివచ్చును. కొన్ని సమయములందు ఆ సమూహమంతయునుఒక్కసారిమహోగ్రతజెంది తలలుక్రిందికి వంచి అవి దేనినిచూచి కోపముగనుండునో దానిమీదకు దుమికి చంపివేయును. ఈరీతిగనే పెద్దపులి మున్నగు భయంకర మృగములు సముద్రతీరములందున్నపుడు ఈదున్నల గుంపులు వానిమీదబడి చీల్చివేయును.

## పీఠభూమి

తోడాలు నీలగిరిపీఠభూమిమీద 800 సంవత్సరముల నుండినివసించుచున్నట్లు తెలియుచున్నది. దున్నలను గేదెలను పెంచి జీవించుటయే వారివృత్తియైయున్నది. బ్రిటిషు ప్రభుత్వము రాకపూర్వము ఈజాతివారే ఆపీఠభూమికి ప్రభువులైయుండిరి. కాని వారు పచ్చికబయళ్లనుమార్చివేసి "ఉదకమాండు" అనుపట్టణమును నిర్మించుటకు ప్రారంభింపగనే వీరి

ప్రభుత్వము నాశనమైనది. క్రొత్తగా జరిగిన సర్వేలెక్కలను బట్టి ఒక్కొక్క తోడామనిషికి 50 నుంచి 70 యకరముల వరకు యున్నదని తెలియుచున్నది. ఈభూమిమీద ఎకరము నకు 0-2-0 అణాలవంతున శిస్తుకట్టుదురు. ఈశిస్తు తప్ప మరి యేశిస్తుగాదు.

## శ్మశానమునందు చేయు విచిత్రములు

తోడాలు వివాహములు నిశ్చయించుకొనినపుడు దున్నలను ఒకరికొకరు మార్చుకొందురు. అదియేవారిప్రమాణము. మరలవివాహము జరుగునపుడు మరొకసారియట్లే మార్చుకొందురు. చచ్చినమనిషిని శ్మశానమునకు తీసికొని పోవునపుడు కొన్నిదున్నలనుకూడ తీసికొనివెళ్లుదురు. చచ్చినవానియందు ఆపరిసర గ్రామములవారు గౌరవముజూపుదురు. దానిమెడలో నొకబొలుగు కట్టియుండును. శ్మశానమునకు వెళ్ళినతరువాత "మీరు వెళ్లుడు, వెళ్లుడు" అను పదములతో దున్నలను గోతిదగ్గరకు తోలినపుడు అచట నేస్చువారందరును క్రింద నుండు దుమ్మును కొంచెము కొంచెము తీసికొని దున్నలమీద జల్లుదురు. తరువాత దున్నలనన్నిటిని చంపుటకేమైన అభ్యంతర మున్నదా యని ఆశవము నడుగుదురు.

## సంవత్సరీకము

చనిపోయినవారందరికి సంవత్సరీకము చేయుదురు. సంవత్సరీక మొదటిదినమున బలియొసంగుటకు నిర్ణయింపబడిన దున్నలను అవియుండు పశువుల కొట్టములనుండి ఒక సంవత్సరీకమునకు రెండుమూడింటిని బలియిత్తురు. రెండవ

దినమున పెట్టెతో కప్పబడిన శవవాహనమును బయటకు తీయుదురు. పశుశాలయొక్క ద్వారముయొద్ద బయటపక్క నొక పెద్ద గొయ్యి త్రవ్వినపిమ్మట అచ్చటనున్న పురోహితుడు పూజావిధులు గావించును. తరువాత పూజారి పూల దండలతో అచ్చటకు తేబడినదున్నపోతులదగ్గరకు వచ్చి వానిమీద విసరును. అప్పటికే యువకులచేత నానావిధ కష్టములు పెట్టబడియున్న దున్నలు మార్గము కనపడక గల్లంతు చేయును. కాని వెంటనే పరుగెత్తుకొనివచ్చి బలియిచ్చిన పశువుల మొండెములను శవవాహనమువద్దకు ఈడ్చుకొనివచ్చి దానిపక్కనుంచి అందరు నేడ్చుదురు. తరువాత జరుగుపని అతిభయంకరముగను క్రూరముగనుయుండును. ప్రభుత్వము వారీ పద్ధతులను నిషేధింతురని తోడాలుభయపడుచుందురు.

## ఈజాతిగేదెలు

ఈ జాతిగేదెలు బాగుగా పాలిచ్చును. పాలు రుచిగా నుండును. ఇవి పాలకేగాని తదితరపనులకు పనికిరావు. ఉదయమున సూర్యోదయమునకు ముందే పాలు పితుకుదురు. రాత్రి వేళ పశువులను కాపాడుటకు రాతితో గుండ్రముగ పెద్దగోడ కట్టి యుండును. దానికొక కొయ్యద్వారము మాత్రము యుండును. అది చాల బలముగను, పశువుల సంఖ్యనుబట్టి పెద్దదిగను కట్టబడియుండును. ఆ గోడ మూడు నాలు గడుగుల యెత్తుండును. వర్షాకాలమునందు పశుశాలకు వచ్చు చలిగాలిని రానీయకుండ చిన్నచిన్న పొదలతో నాద్వారములు కప్పివేయుదురు. ఈ పశుశాలమీద నేవిధమగుకప్పుయుండదు.

అవి అన్నికాలములందు వర్షములకు, ఎండలకు విడిచిపెట్టు దురు. చిన్నదూడలను మాత్రము అతి జాగ్రత్తతో అన్ని కాలములందును కప్పువేసిన చావడియందు కాపాడుదురు.

## దక్షిణకన్నడపు దున్నలు

ఈ ప్రదేశమునందు జెయిన్ బాంట్సు అనునొక హిందూజాతి తెగవారున్నారు. వారు చక్కని దున్నలను పెంచుదురు. వానిలోకెల్ల అందముగలవి కొన్ని మంగుళూరు ప్రాంతమునందున్నవి. ఆప్రదేశములందుండు ఇతరపశువులు కొన్ని చిన్నవి యగుటచేత నవి వ్యవసాయమునకు పనికి వచ్చుచున్నవి. దున్నలను పోట్లాడించుటయనిన మిగుల ప్రీతి. ప్రతిధనవంతుడును కంబ్ల అను పవిత్రవంతమైనపొలమును ఈ దున్నల పోట్లాటలకై ప్రత్యేకస్థలమును వదలిపెట్టుదురు. ఈపందెమునకుపయోగించుచున్నలజత రు 500-0-0 లు ఖరీదు యుండును. వానినెప్పుడైన నరుదుగ దుక్కికి నుపయోగించు దురు. అవిపరుగెత్తించబడినప్పుడు వానిచుట్టును మూగియున్న వారు ఆపరుగెత్తు రెండింటిలో నేది ఎత్తులను దూకుచు పరు గిడునో దానిని కనిపెట్టి గుర్తించుదురు. ఒకొక్కప్పుడు సుమారు 20 అడుగుల ఎత్తుగల కటకటాలను నిర్మించుదురు. సామాన్యముగా నీవిధానమంతయు 150 గజముల పొడవుగల తడియు, బురదయు నీరుండు ప్రదేశమునందు పందెములు జరు పుదురు.

## పందెములు వేయుట

వానిని తోలువాడు వలయు దండములను చేతబుచ్చు

కొని 18 అంగుళములు యెత్తును, 12 అంగుళముల వెడల్పును గల యొకబల్ల నెక్కును. దానిమీద మరియొకబల్ల యుండును. అంతటతోలువాడు ఒకకాలును చిన్నబల్లమీదను, రెండవ కాలును దున్నకువేయబడినకాడికి తగిలించబడిన ఒకచిన్న బండిమీదను వేసి ఒకచేతితో కొరడాను, మరియొక్కచేతితో దున్నతోకను పట్టుకొనును. ఎట్టిపగ్గములను పుచ్చుకొనడు. ఈరీతిగా ఆటయాడబడుచున్నపుడు తోలువాడు తాను మొదట కాలువేసిన బల్లను ధ్వనిఅగునట్లుగ బలమంతయు జూపి ఆబల్లను గుద్దుచు కొంచెము నీటిని, బురదను తీసు కొని తనచుట్టును పిన్ను ఆఫ్ వేల్ను వ్రేలాడబడుగానుఆకార ముగా జల్లును. అప్పుడప్పుడు వాడు పడుచుండుటయు గలదుగాని భూమియంతయు బురదతో, నీటితో కూర్చుకొని యుండుటచే దెబ్బమాత్రము తగులదు. ఆ చుట్టునున్నవారు ఒకొక్కప్పుడు కేకలువేసి అరచినపుడు తోలువాడు కొన్ని చిత్రమైనపనులు చేయును. ఇటువంటి పెద్దపెద్ద ఆటలకు నా చుట్టుప్రక్కలనున్న గ్రామములనుండి సుమారు నూరు జతలదున్నలు వచ్చును. ఆచుట్టుప్రక్కల షావుకార్లు రాక పోయినను తమదగ్గరనున్న దున్నలను మాత్రము తోలిపెట్టు దురు.

పర్లాకిమిడి దున్నలు (Parlakimidi Buffalose)

గంజాంజిల్లాలో నీజాతిదున్నలు మూడురకములుగలవు.

1 దేశి లేక మంద

2 పెద్దకిమిడి

3 జిరంగి

ఈజిల్లాలోనియితరభాగములలోనున్న దున్నల గేదెల కంటె నీపశువులు పొడవుగ బలముగ నుండును. అవిముదురు బూడిదరంగు కలిగియుండును. జిరంగిజాతిబత్తెలకంటె కొంచెము నలుపుగ నుండును. అతివేడిమినంతగా భరించలేవు. ఎంతబరువువేసినను శాంతముగ, ఆయాసము లేక లాగును. జిరంగిజాతి గేదెలును, పెద్ద కెమిడిజాతిగేదెలును, పర్లాకిమిడిజాతిగేదెలును పర్లాకిమిడితాలూకా ప్రాంతములందుగూడ దొరకునుగాని అవి పర్లాకిమిడిగేదెలంతగా పాలీయవు. సామాన్యముగా పర్లాకిమిడిలోనే తప్ప తదితరచోట్ల దొరకవు. దున్నలు వ్యవసాయమునకు ముఖ్యమైనవి. ఆ ప్రాంతములోని ఎద్దులు దున్నలులాగినంతబరువు లాగలేవు. పర్లాకిమిడి యస్టేటురైతులు ఎద్దులకన్న దున్నలనే ఎక్కువగా నుపయోగించుదురు.

---

# విదేశమందలిపశుజాతులు

## జెర్సీజాతి (Jersey)

ఇంగ్లీషుఛానలులోనున్న జెర్సీఅనుద్వీపములో ఈజాతి పశువులు గలవు. ఆయా రాజు లీద్వీపములోనున్న పశుసంతతిని వృద్ధిచేయదలచిరి. తదితర దేశములనుండి యెవరైన ఆచిన్న దీవికి పశువులను దెచ్చుకొనినయెడల వారికి దండన విధింపబడుచుండెను. ఈ కారణమువలన అనేక శతాబ్దముల నుండి ఈచిన్న దీవుల పశువులు అన్యజాతిసంపర్కము లేక

కేవలము స్వజాతిపశువులై జ్ఞాతిసంబంధముగలవి కావలసి వచ్చినవి. కాన మొదట నవి అంతగా పాలిచ్చేవిగావు. 18 వ శతాబ్దములో పెద్దరోగమనువ్యాధి యూరపుఖండములో పశ్చిమ భాగమున వ్యాపించినది. అందువలన నీజాతి నెక్కడ డకును దిగుమతిచేయువారుకారు. ఇప్పటికికూడ సరిగా దిగు మతిచేయరట. కాని ఒకశతాబ్దమువరకు నీజాతిలో కల్తీ యేమియులేదు. 1850 వ సంవత్సరమువరకు చిన్నచిన్నసంఖ్య లతో ఉత్తరఅమెరికాకు దిగుమతిచేయుట నారంభించిరిగాని 1870 వ సంవత్సరమువరకు అంత ఎక్కువదిగుమతిలేదు. అప్ప టినుంచి ఈజాతి ప్రతిసంవత్సరము చాల అభివృద్ధిగాంచు చుండెడిది.

## ఆవులు

ఈజాతిఆవులు తెలుపురంగుగా నుండును. వీనినే జింక పిల్లరంగుఆవులందురు. కాని మొత్తమువీూద ఒకటేరంగు గల ఆవులను కొనువారు చాలమంది యుండెడివారు. రంగు భేదములేకయే కొనుటగూడ జరుగుచున్నది. ఈజాతిఆవులు సుకుమారజంతువులైయున్నవి. ఇది చిన్నజంతువగుటవల నను, సాధుత్వము గలదగుటవలనను, పెంచుటకు వీలుగా నుండుటవలనను, ప్రతిరైతు కావలెనని కోరుచుండును. కాని దీనిని సరిగా పోషించకపోయినయెడల వీటికి కోపము, తామ సము, ఎక్కువై అలిగి మేత నీరు మానునట. యజమానుని పొడచునట. పాలు సరిగానీయక తిప్పలుపెట్టునట. అందుచేత నీజాతిని కొనినరైతు చాలజాగ్రత్తగా పోషించును. ఇవి అంత

ఎక్కువగాను తక్కువగాను పాలనీయక సమానముగా నిచ్చు చుండును. ప్రపంచములో నున్న ఆవులలో జెర్సీఆవులతో సమానముగా మంచిపాలిచ్చుఆవు లెక్కడనోతప్ప అంతటను కన్పట్టవు. ఈజాతికి బెదరులేదు. చేపలు, ద్రాక్షపండ్లు, తవుడు, చిట్టు, గడ్డి మొదలగునవి సాధారణముగా పెట్టబడుచుండును. చేపలుతినినపశువులపాలు దుర్వాసనగానుండును.

## జెరన్సీజాతి (Guernsy)

జెర్సీజాతికన్న ఈజాతి ఆకారములో పెద్దవై దృఢమైన ఎముకలుగలిగి బలిష్ఠములుగా నుండును. వీనివలన తయారైన గోమాంసము చాల ప్రశస్తమైనది. ఈజాతిలో జెరన్సీ, ఆల్డర్నీ, శార్కు, హీరం దీవులలోని పశువులుకూడ చేరి యున్నవి. ఈజాతికూడ ఇంగ్లీషుఛానలులోనున్న జెరన్సీ ద్వీపములోనున్నవి. ఇవి కూడ ఫ్రాన్సునుంచి వచ్చినటులనే తెలియుచున్నది. 19 వ శతాబ్దములో జెర్సీ, జెరన్సీ ఆవులను ఇంగ్లండు దేశమునకు ఎగుమతి చేసినపుడు రెండుజాతుల కంత భేదము లేకుండ నుండెను. ఈ రెండుజాతులను కలిపి ఆల్డర్నీ నుంచి ఎగుమతి చేయుటవలన ఈ పేరు వచ్చినదని తెలియుచున్నది. అక్కడ గొప్ప రేవుపట్టణ ముండుటచేత ఎగుమతి యయ్యెడివట. ఈరెండుజాతులును ఉత్తరఅమెరికాకు ఎగుమతి చేయబడినపుడు మొదట యేజాతియైనది కనుగొనుట కష్టమైనదట. కాని కొంతకాలమునకు ఈరెండుజాతుల భేదములను తెలిసికొనుటచేత కలితిలేకుండ జేసిరి. దిగుమతిచేయబడిన జెర్సీఆవులలో పోల్చి చూచినచో జెరన్సీఆవులు తక్కువగా నుండును. ఈజాతిఆవులు యునైటెడ్‌స్టేట్సులోని కనడాదేశ

ములో నెక్కువగానున్నవి. వీటిసైజు జెర్సీఆవులకంటె పెద్దవి. యుక్తవయస్సు వచ్చిన ఆవులు 1200 పౌనులు తూగునట.

## రంగుభేదములు

శరీరమంతయు నొకటేరంగుగానుండదు. తెలుపుమచ్చ యుండును. గోధుమ, బూడిద, ఎరుపు, నలుపురంగులమీద తెలుపుమచ్చలు గలవియును, కొన్ని దేహమంతయు మచ్చలుగలవియును, చారలుగలవియును మంచివని యెంచుదురు. జెరస్సీజాతివెన్న రంగు గలిగి చిక్కగానుండును. వారమునకు 10 లేక 12 పౌనులవెన్నవరకు వచ్చును. ఒక్కొక ఆవు సంవత్సరములో 700 నుంచి 750 గ్యాలనుల పాలవరకు యిచ్చుచుండును. జెరస్సీద్వీపములో 8 వేల పశువులు గలవు.

## షార్తారన్‌జాతి (Shorthorn)

ఈ జాతిపశువులు 1800 వ సంవత్సరములో నార్తెంబరులెండులోను, డర్‌హామ్‌యార్కులోను, లింకోలనులోను యెక్కువగా నుండెడివి. డర్‌హామ్, న్యూయార్కులలో ఈజాతి వృద్ధిజెందినది. ఈజాతినే ఆరంభమున డర్‌హామ్‌జాతియని పిలచెడివారు. గ్రేటుబ్రిటన్‌లో షార్తారన్ జాతికి పేరువచ్చిన తరువాత ఉత్తరఅమెరికాలోను, ఇతరదేశములలోను డర్‌హామ్ జాతియని పిలుచుచుండెడివారు. హాలెండు దేశమునుంచి దిగుమతి చేయబడిన ఎద్దులవలన యిక్కడజాతిఆవులను దాటించుచు పశుసంతతిని వృద్ధిజేసెడివారు.

## జాతి రంగులు

ఈజాతికి ఎరుపు, తెలుపు, ధూమ్రము మున్నగు రంగులు స్వభావసిద్ధముగా నుండెడివి. పాడిపశువులు ఎరుపు రంగు కలిగియుండెడివి. తెలుపురంగుగల గిత్తల జాతికూడ

యెక్కువగా నుండెడివి. తెలుపురంగుగల గిత్తలను వెయ్యి గిన్నీలకు కొనుచుండెడివారు. చారలు మచ్చలుగలవి ఈషార్తార న్ జాతిలో లేవు. పశువుల పెదవులు, అంగిలి, నోరు, కను రెప్పలు మున్నగునవి కండబట్టి ఎరుపురంగు గలిగియుండ వలెను. వెండ్రుకలు లేని శరీరభాగమున నలుపురంగుగగాని, మబ్బురంగుగాగాని, యుండినచో నాణ్యముచేయరు. చర్మము తెలుపుగా నుండవచ్చును. ఈజాతియొక్క కొమ్ములు పొట్టివి గను, కొద్ది వంకరగను, ముందునకు ఏటవాలుగా నుండును. ఎద్దుల కొమ్ములకంటె ఆవులకొమ్ములు నిడుపుగను అంద ముగను యుండును. నలుపురంగుగలకొమ్ములుగలిగిన ఆవు లను నాణ్యముచేయరు.

## వంశవృద్ధి

1800 వ సంవత్సరములో నీజాతి నానాటికి వృద్ధిజెందు చుండెడివి. మంచిఎద్దులచరిత్రలుగలిగినపుస్తకములను అప్పుడు ఈజాతిని పోషించుమహనీయుల దగ్గర నుంచుకొనుచుండెడి వారు. ఈజాతిలో వన్నె కెక్కినదూడలు వానితల్లులను పోలినవై యుండెడివి. 1737లో దూడగానుండి స్టడ్లిబుల్ (Studly bull) ఈవంశవృద్ధికి కారణమైయున్నది. 1777లో పుట్టిన హుబ్బాక్ (Hubback) ఈషార్తారన్ జాతికి మూలాధారమై వంశవృద్ధిజేసి నది. ఛార్లెసు రాబర్టుకోలింగు 1780 లోనే ఈజాతిని మంచి ఉన్నతదశలోనికి తెచ్చిరి. మంచివంగసమునేరి బాగుగా పోషించెడివారు. దేశమంతయు నీజాతినిగూర్చి విమర్శించి పోషించుటకు తగినప్రోత్సాహమిచ్చుటచేత వారిరువురిపేర్లు బయటకు వచ్చినవి. ఇందువలన ఈషార్తారన్ జాతి యునైటెడ్ కింగడంలోనికెల్లను మంచిపేరు గాంచినది.

## బూత్సుషార్తారన్ జాతి (Butu Shorthorn)

1900 సంవత్సరములో నిద్దరు మహనీయులు ఈజాతిని వృద్ధిలోనికి తీసికొనివచ్చిరి. ఈజాతి పాలకంటె మాంసమున కెక్కువగా ప్రసిద్ధికెక్కినది. వేసవిలో పచ్చికయు చలికాలములో ఎండుమేతయు నీజాతికి మేపి బాగుగా బలిపించి అక్కడ కూడ నప్పుడప్పుడు వీరిచే పోటీపందెములు వేయించి గెలుపొందించి మంచిపేరులోనికి రాగలుగునట్లుచేసిరి. పొట్టికాళ్ళు గలవి నలుపురంగుగలవి మంచికండగలవి అగు ఈజాతిపశువులు మంచి పేరులో నుండెడివి.

## పాలిచ్చుషార్తారన్ జాతి (Shorthorn dairy breed)

బెయిట్సుషార్తారన్ జాతిఆవులు పాలిచ్చుటలో మిగుల ప్రసిద్ధిగాంచినవి. ఈజాతినుండి తీయబడినపాలను సమీపమున నున్న బస్తీలలో అమ్ముచుండెడివారు. దూడలకు పాలుతక్కువగా నుంచి ఎక్కువగా పితుకుటవలన పశుజాతి కొంతవరకు క్షీణించినది. గ్రేట్‌బ్రిటనులోను, తదితర దూరదేశములలోను ఈపాడిపరిశ్రమ అభివృద్ధిలోనుండెను. రిచర్డుస్టాన్లీటన్, జోన్యటీలర్, జాన్‌తోరంటన్ మొదలగు మహనీయులు ఈ షార్తారన్ జాతిని బాగుగా పోషించుచు 1900 సంవత్సరము మొదటిలో బాగుగాపాలిచ్చు ఈజాతిపశువులకు బహుమానమిచ్చుచుండెడివారు. 1905 వ సంవత్సరములో కొంతమంది కలసి సంఘముగా నేర్పడి ఈజాతిని వృద్ధిలోనికి తెచ్చుటకు ప్రచారముచేసిరి. ఒకపెద్దమనిషిదగ్గర పాలుతీయించి పాలయొక్క శుభ్రతనుబట్టియు, తూకమునుబట్టియు, వానికి బహుమానమిచ్చెడివారు. నాలుగు సంవత్సరముల ఆవు ఈనిన మూడునెలలలోపుగా కనీసము 25 పౌనుల పాలిచ్చిననేగాని

బహుమానము లేక సర్టిఫికెట్టు పొందజాలదు. నాలుగు సంవత్సరములు అంతకు పై వయస్సున్న ఆవు కనీసము 8 వేల పౌనులపాలీయవలెను. నాలుగు సంవత్సరముల వయస్సుగల ఆవు ఆరువేల పౌనుల పాలీయవలెను. ఈపాలయొక్క పరిమాణములను తేలికగా తెలిసికొనుటకు గాను రికార్డు తయారుచేయుదురు. కొన్ని కేసులలో పాలు నిత్యము కొలుచుట కష్టము. కొన్నిటిలో వారమున కొకసారి రెండుసార్లు కొలుచుదురు. ఈపై చెప్పినపశువులు వంశపరంపరగావచ్చినవి.

## నన్ పెడిగ్రిషార్తారన్ జాతి

## (Non pedigree shorthorn dairy breed)

ఇంగ్లండునకు ఉత్తరభాగములోను, క్షైషైరులోను ఈజాతి పెంచబడుచున్నది. ఇంగ్లండునకీశాన్యదిక్కున యున్న ఈజాతి పశువులను పోషించు మహాశీయులు పాడిపరిశ్రిమలో అజాగ్రిత్త చేయుచుండెడివారు. ఎద్దులను, ఎండిపోయిన ఆవులను మాంసపరిశ్రిమకనియు, బాగుగా పాలిచ్చు ఆవులను పాడిపరిశ్రిమకనియు రెండు భాగములుగ విడదీసిరి. ఐర్లండులో నిప్పటికికూడ ఈ జాతిపశువులున్నవి. నూరు సంవత్సరములకి్రిందట లాంకషైరునుండి, ఇంగ్లండు దేశములో నితర భాగములనుండి తేబడిన లాంగుహారన్నుజాతి పశువులు చాల కాలమువరకు వృద్ధిలోనున్నవి. కాని క్రిమేణషార్తారన్ జాతి ఎద్దులయొక్క వృద్ధి ఎక్కువగా నుండెను. వ్యవసాయ డిపార్టు మెంటువారును, రాయల్ డూబ్లీ సొసయిటీవారును షార్తారన్ జాతి ఎద్దులయొక్క వృద్ధిని బాగుగా వ్యాపింపజేసిరి. ఐరిషు షార్తారన్ జాతులు ప్రితిసంవత్సరము ఇంగ్లండునకు స్కాట్లండునకు విరివిగా పంపబడుచుండెడివి.

## హియర్‌ఫోర్డుజాతి (Hereford)

ఈ జాతి ఇంగ్లండులోనేగాక ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాలలో నుండెడిది. మాంసమెక్కువ తయారుచేయుట లోను, దూరదేశములకు ప్రయాణము సునాయాసముగా చేయుటలోను, పచ్చిక యెక్కడ బాగుండునో అచ్చటనే నివాస మేర్పరచుకొని బాగుగా బలియుటచేతను, ఈ జాతి పేరుగాంచినది. ముఖము, కడుపు గొంతుక, కాళ్ల లోపలి భాగము, తోకచివరను తెలుపుగను, కొమ్ములు తెలుపు లేక బూడిదరంగుగను యుండును.

ఈ జాతి క్షయరోగమును బొందజాలదు. తీక్ష్ణమైన సూర్యరశ్మి కంటికి తగిలినపుడు కన్ను వేడిమికి బెదరునంత సుకుమారత గలిగియుండును. అందుచేత గోధుమరంగుగల కనుగుడ్లున్న పశువును నాణ్యముజేసెదరు. డెవన్‌సాసెక్సు జాతులవలె దక్షిణయింగ్లండులోనున్న రెడ్‌జాతినుండి ఈజాతి వచ్చుచున్నది. 19 వ శతాబ్దమువరకు లాగుట కుపయోగించెడి ఎద్దులను బాగుగా పోషించెడివారు. ఈ ఎద్దులు భుజమువద్ద ఎత్తుగలిగి ఆకారములో పెద్దవిగానుండును. 18 వ శతాబ్దములో ఇంగ్లండుయొక్క మధ్యభాగమును, తూర్పు భాగమును, ఈ జాతిఎద్దులను కొని అమ్మటలో మంచి పేరు గాంచినవి. ఒక పోటీపందెములో 185 బహుమానములు ఈ జాతికి, తదితరజాతుల కన్నిటికి 190 బహుమానములున్ను ఈయబడెను.

## ఎబర్డీన్ ఎంగిన్సు ( Aberdeen Angns. )

ఫోర్‌షాన్‌షైర్, యబర్డీన్‌షైర్‌లోను ఈజాతి యుండెడిది. హగ్గు, వాట్సన్, ఫోర్ పార్‌షైర్ అను పెద్దవ్యవసా

యదారుడు 1808 నుండి ఈ జాతిని గురించి పనిచేయుచుం
డెను. ఆతనితండ్రి ఆతనికి ఈ నలుపుజాతిలో మంచివానిని
ఆరుపశువుల నిచ్చెను. దగ్గరనున్న మార్కెట్టులో నిటువంటి
వానిని ఖరీదుచేసెను. ఎబర్డీన్ షైర్ కాపురస్తుడు విలియం
మెక్కోంబీగారు ఇతరులకంటె శ్రద్ధవహించి బాగుగాపనిచేసిరి.
ఈయన పోషించిన జాతులద్వారా రెండుబహుమానముల
బడసెను. 1873వరకు ఉత్తరఅమెరికా నీజాతి కనిపించెడిది
కాదు. కాని దరిమిలా హియర్ ఫోర్డుజాతివలె ఇప్పటివరకు
ఉత్తరఅమెరికాలో నీజాతిపశువులుండుచున్నవి. స్కాట్లండు దేశ
ములో పెరుగు ఈజాతిపశువులు పాడిపరిశ్రమలో మంచివి.
మాంసపరిశ్రమకుకూడ ఈజాతిఉన్నతమైనది. షార్తారన్,
హియర్ ఫోర్డుజాతులంత పెద్దవికావు. ఇది పొట్టికాళ్ళుగలిగి
చూచుట కందముగానుండును. వానియాకారమునకు తగినంత
తూకము గలవియై యుండును. ఇవి గుండ్రని యాకారము
గలిగి యెత్తునకు మించిననిడుపు గలిగి, ఎముకలనిర్మాణము
అందమునిచ్చుచు తగినంత కండగలిగియుండును. ఇవి నలుపు
రంగు కలిగియుండవలెను. షార్తారన్ జాతి ఈజాతిపశువులను
దాటుచుండెడివి. ఈ జాతికి కొమ్ములుండవు. మాంసపరిశ్రమకు మాత్రము ప్రసిద్ధిగాంచినవి.

## డెవాన్ జాతి (Devon)

ఇవి సాసెక్సుజాతినిపోలియుండును. ఎబర్డీన్, యాంగెస్
జాతిమాదిరి నిర్మాణముగలిగియుండి మాంస పరిశ్రమకు
మంచివిగానుండెను. శరీరము ఎరుపువర్ణముగా నుండి అక్క
డక్కడ మచ్చలుండును. ఆవులకొమ్ములు పొట్టివిగానుండి
కొంచెము వంకరగానుండును. ఎద్దుకొమ్ములు తిన్నగానుండి

కొంచెయు ఏటవాలుగానుండును. ఈజాతిపశువులు శరీర పరిశ్రమలో మంచిపేరుగాంచెను. గ్రేట్ బ్రాంసర్ యొక్క పార్క్విన్ సెస్స్ క్వార్లి అనునతడు ఈజాతిని ఆరంభములో పైకి దీసెను. తాను చూచినంతలో మంచివిగానున్న జాతిపశువులను కొని పోషించెడివాడు. హాల్ భామునుండి ఈజాతిపశువులు విరివిగా యునైటెడ్ స్టేట్సుకు ఎగుమతి చేయబడుచుండెడివి. షార్తార్న జాతులంతయెక్కువగా అమెరికాదేశములో ఈజాతిని పోషించెడివారుకారు. ఉత్తరదక్షిణ అమెరికాలలోను, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలోను, ఈజాతి యుండెడిది. ఈ జాతి మధ్యరకముగా పాలనిచ్చును. మాంసపరిశ్రమకు ఎక్కువగను, పాడిపరిశ్రమకు తక్కువగను ఈజాతులు పెంచబడెడివి. సన్నని తేలిక ఎముకలు గలిగి శరీరము చాల మృదువుగా నుండును. ఇవి మిగుల తెలివిగల జంతువులు. ఈజాతిఎద్దులు బండ్లు బరువులు లాగును.

## సుస్సెన్‌జాతి (Sussen)

ఈ జాతి క్వెంటులోను, సరేలోను, సౌసెక్సులోను మాంసపరిశ్రమకు పెంచబడుచుండెడివి. బ్రిటీషు పశుజాతులన్నిటిలోను ఆకారములో పెద్దవిగా నుండెడివి. ఎరుపురంగు గలిగియుండును. అవి తిను ఆహారమునుబట్టి కండగలిగి తగినంత మాంసమును యిచ్చుచుండెడివి. ఇవి బరువులు లాగుటలో ప్రసిద్ధికెక్కినవి. అమెరికాకు, దక్షిణాఫ్రికాకు ఈ జాతులు పంపబడుచుండెడివి. స్వదేశఆవులను ఈ జాతిఎద్దులు దాటుటచే ఈ జాతిదూడలు పుట్టుటయుగలదు. సమీపజిల్లాలలో ఈ జాతిఎద్దులవలన ఎక్కువగా పనుల చేయించుచుండెడివారు. ఇవి త్వరలో నశింపుగలుగుచుండెడివి.

## గాల్లోవేజాతి (Galloway)

ఈ జాతి 17 వ శతాబ్దము లగాయతు పెరుగుచున్నవి. స్కాట్లండునైఋతిదిక్కు వీనికి పుట్టినిల్లయియున్నది. కెర్కు డ్రైటు, విగ్టవున్, బ్రిటిషుదీవులు, ఇంగ్లండు మొదలగు ఉత్తరభాగములలోను నివసించుచుండెడివి. వీనికి చలిగాలి చక్కగా సరిపడును. వీనికి తక్కువ మేత మేపినను బాగుగా కండ బట్టి విరివిగా వృద్ధిపొందుచుండెడివి. ఈ జాతికి కొమ్ములులేవు. నలుపురంగుగా నుండును. ఈ జాతిపశువు లిప్పుడుగూడ అక్కడక్కడ కనిపించుచుండును. తల కురచగను వెడల్పుగను కన్నులు పెద్దవిగను శరీరము గుండ్రముగను మంచి నిర్మాణము కలదిగను కాళ్లుపొట్టివిగను చర్మము బిరుసుగను వెండ్రుకలు మెత్తగనుయుండును. ఈజాతి ముఖ్యముగా శ్రేష్ఠమైన మాంసమిచ్చుటచే పేరుగాంచినవి. ఈజాతి ఆవుల దాటుటకు ముఖ్యముగా గణించబడినవి. వీనివంటి కొమ్ములు లేని దూడలే పుట్టుచుండును. ఈజాతి కెనడా, ఉత్తరఅమెరికాలలో వృద్ధిగాంచబడినవి.

## వెస్టు హైలాండుజాతి (West Highland)

ఈజాతి స్కాట్లండుయొక్క ఎత్తుప్రదేశములలోను, వానిదీవులలోను నివసించుచుండెడివి. అన్ని ఇంగ్లీషుజాతుల లోనికెల్ల నీజాతి శరీరమునిండ బొచ్చుగలదై, గట్టితనముగా నుండును. ఇది సంకరజాతి. వీపుతిన్నగను, కాళ్లుకురచగను, ఎదురురొమ్ము వెడల్పుగను, శరీరము గుండ్రగను, కొమ్ములు అందముగను, కండ్లు పెద్దవిగను, ముఖము చిన్నదిగను, నలుపురంగుగానుండి తెలుపుమచ్చలుగను, అక్కడక్కడ పసుపురంగుగను యుండును. కొమ్ములు బలము

గలవై కొద్దిగా ముందునకు వంగియుండును. ఎద్దులకన్న ఆవుల కొమ్ములు త్వరగా పైకివచ్చును. కొమ్ములు నిడుపుగలవై యుండును. ఇవి గట్టివరుస జంతువులగుటచే ఎటువంటి తక్కువ మేత మేసినను బాగుగా పెరిగి త్వరలో వృద్ధిగాంచుచుండును. వీనికి శీతోష్ణస్థితి సరిపోనందువలనను, తక్కువమేత తినుట వలనను ఈజాతి ఆకారములో తదితర జాతులతో సరిపోక చిన్నవిగానుండును. వీనిమాంసము చాల ఉత్తమమైనది. త్వరలో వృద్ధిగాంచు షార్టార్న మొదలగు జాతులతో వీని ఆవులను దాటించిన కొంతవరకు మంచిజాతిదూడలను కనుచుండును. ఇవి పాలుకొద్దిగాయిచ్చును. ఒకదూడకు మాత్రమే సరిపోవుచుండును.

## రెడ్‌పోల్‌జాతి (Redpoll)

ఈజాతి నార్ఫోక్, సఫోక్ అను రెండు ప్రదేశములలో యున్నవి. పురాతనమైన ఎరుపురంగు కొమ్ములుగల నార్ఫోకు జాతియొకటి కపిలవర్ణమైన సఫోక్‌జాతియొకటి ఈజాతిలోని భాగములు. కపిలవర్ణపుజాతి పాలుయిచ్చుటలో ప్రసిద్ధిగాంచినవి. నార్‌ఫోకుజాతి ఆకారములో చిన్నదిగనుండి మంచి అందముగలిగి యుండును. త్వరగా పెరిగి యున్నతమైన మాంసము కలుగజేయును. ఈజాతి ఎరుపురంగుగలిగి, తోక చివరభాగము, పొదుగుభాగము తెలుపుగానుండును. ముక్కురంధ్రములు పరిశుభ్రముగా తెలుపుగానుండిన ప్రశస్తమని యెంచుదురు. నలుపురంగుగను, నీలిరంగుగను, మబ్బురంగుగను ముక్కురంధ్రములున్నచో మంచిదానినిగా పరిగణించరు. కొమ్ములు చూచుటకు అంతనాణ్యమైనవిగావు. రెడ్‌పోల్‌లో సంఘములు గ్రేటుబ్రిటనులోను, ఐర్లండులోను, 1888 లో

నేర్పడెను. ఈజాతిగిత్తలను బాగుగాపెరుగనిచ్చి కసాయి వానికి మాంసముకొరకు నొప్పగించుదురు. వీనిమాంసము లండర్ మార్కెట్టులోనుంచి ఎక్కువఖరీదునకు అమ్ముదురు. ఇవిపాడిపరిశ్రమకు పనికివచ్చుటచే దూరదేశములనుండి అన్ని కంపెనీలకు ఎగుమతిచేయుదురు. యునైటెడ్ స్టేట్సులోగూడా ఈజాతి కనబడును.

## ఎయిర్ షైర్ జాతి (Ayrshire)

ఈజాతి 18 వ శతాబ్దముమధ్యలో నుండెడివి. ఛానల్ దీవులజాతులనుండియు, డచ్చిజాతులనుండియు నీజాతి వృద్ధి గాంచబడినది. ఈజాతి యితరజాతులతో పోలియుండదు. 300 సంవత్సరముల క్రితము స్కాచ్ జాతులకు ఈజాతికి పోలికయుండెడిది కాదు. స్కాట్లండు నైరుతిదిక్కున అదివర కున్న గ్యాల్లోవేజాతిని ఈజాతి తరిమివేసి ప్రపంచమంతటిలో వ్యాపించిపోయినది. ఈజాతి పాడిపరిశ్రమకు ప్రసిద్ధికెక్కినది. చన్నులు చిన్నవిగానుండును. 1906 వ సంవత్సరములో చన్నులను కొలిచిచూడగా 2¼ లగాయతు 3½ అంగుళములవరకు యుండెడివి. అంతకు పూర్వము 2 నుంచి 2½ అంగుళముల వరకుండెడివి. అన్నిరంగులలోను తెలుపువర్ణమున్ను, అక్కడక్కడ తలకు దగ్గరగా ఎరుపు గోధుమవర్ణపు మచ్చలున్ను గలదానిని నాణ్యముగా నెంచుదురు. కపిల వర్ణముగలజాతి కూడ మంచిదిగాదు. 800 నుంచి 1000 పౌనుల పాలిచ్చెడివి.

షార్తారన్ గ్యాల్లోవేజాతులను, ఈఎయిర్ షైర్ జాతిని, జెర్సీజాతితో పోల్చిచూచినచో ఎయిర్ షైర్ జాతి తల, దవుడలదగ్గర లోతుగను, కండ్లదగ్గర వెడల్పుగను యుండును. కొమ్ములు వెడల్పుగా నమర్పబడి పైకి పెరుగును. పొడుగు

భాగము శరీరములో చక్కగానమర్పబడి చూచుటకందముగా నుండును. డెన్మార్కునకు, యునైటెడ్ స్టేట్సుకు, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండులకు, దక్షిణాఫ్రికాకు ఈజాతులు విరివిగా పంపబడుచుండెడివి. ప్రపంచములో పాలుయిచ్చుటలో ప్రఖ్యాతి గాంచిన జాతులలో నిదియొకటి. ఈజాతికి యెటువంటి తక్కువ విలువగల మేతమేపినను పాలు మాత్రము ఎక్కువగా యిచ్చుచుండును. పాలుకూడా మంచిరకములో చేరినవి. వీనిపాలలో వెన్నకూడ తదితరజాతులపాలలో కంటె నెక్కువగా నుండును.

## బ్రిటిష్‌హాల్‌స్టన్‌జాతి (British Holstene breed)

ఈ జాతి ఆకారములో నించుమించుగ షార్టారన్ జాతియంత పెద్దవై పాడిపరిశ్రమకు అనుకూలమైయున్నవి. కపిలరంగు, నలుపు తెలుపు కలసిన రంగు, తెలుపురంగు, నలుపురంగు ఈ నాలుగురంగులు ఈ జాతికి యుండును. వీని రంగులు చూచుటకు అందముగానుండును. తల నిడుపుగాను, పొడుగుగాను యుండును. కొమ్ములు షార్టారన్ జాతికివలె ముందునకు వంగి చూచుటకు అందముగా నుండును. తల నిడుపుగను, పొడుగుగనుయుండును. మెడ సన్నముగనుండి పొడవుగానుండును. ఇతర జాతులతో పోల్చి జూచినయెడల వీనిరొమ్ము లోతుగా వెడల్పుగానుండి బాహుళ్యమైన భుజముగలిగి ఇతరజాతుల రొమ్మునకు మించియుండును. కడుపు లోతుగలిగి విశాలమైనదిగా నుండును. హాలెండు లోను, అమెరికాలోను, ఈ జాతి యెక్కువగా నుండును. ఇతర ఇంగ్లీషుజాతు లన్నిటికంటె ఈ జాతి పాలెక్కువ యిచ్చును. పాలు అంత రుచికరమైనవికావు. ఈ జాతిని ప్రతిచోట

యుంచినచో పాడిపరిశ్రమ కనుకూలముగా నుండును. ఈదేశ
ములో నీజాతిని పాడిపరిశ్రమకున్ను, ఇతర దేశములలో పాడి
పరిశ్రమకున్ను, మాంసపరిశ్రమకున్ను వాడెదరు.

## కెర్రీజాతి (Kerry)

ఈ జాతిపశువు తేలికగా చురుకుగా శుభ్రముగా
అందముగా నుండును చిన్నతల, అందమైన నిడుపుగల శరీ
రము, చిన్నసిరలు, జీవకళగల కన్నులు గలిగియుండును.
శరీరము నలుపురంగుకలిగి పొదుగుమీాద తెలుపు మచ్చ
లుండును. ఎరుపురంగు గలవానిని ఈ జాతిలో జేర్చుకొనెదరు.

ఈ జాతిఆవులు పాడికి శ్రేష్ఠమైనవి. వీని పొదుగు
చక్కగా సమకూర్పబడి విశాలముగలిగ యుండవలెను.
సామాన్యమేత తిని పాలనిచ్చును. పాలిచ్చుటలో నితరజాతుల
కంటె వన్నెకెక్కినవి. 8 కెర్రీజాతిఆవులు 36 పౌనులపాలను,
అందునుంచి 3⅓% వెన్నయున్ను, 33⅛ పౌనుల పాలలో
4½% వెన్నయు కలిగియున్నది. ఈ జాతిఆవులు 900 పౌను
లును, ఎద్దు 1000 పౌనులున్ను తూకములో మించకుండ
యుండును.

## డెక్స్టర్‌జాతి (Dexter)

ఈజాతి కేవలము నలుపురంగునుగాని, ఎరుపురంగును
గాని కలిగియుండును. కెర్రీజాతికన్న ఈజాతి గుండ్రనియాకా
రముగలిగియుండును. కాళ్లు పొట్టివిగానుండి మంచి బలము
గలిగియుండును. మెడపొట్టిగను, మందముగనుండును. కొమ్ములు
తిన్నగా నిడుపుగ మందముగ నుండును. దీనియొక్క పుట్టుక
చరిత్ర సరిగా తెలియదు. ఇదిబహుశా డెక్స్టర్ అనుజాతి
వలన పుట్టించబడిగాని లేక లిమ్‌ఈరిక్, కార్కు సమీాపప్రదేశ

ములలో ఐరిష్ఆవులవలన కెర్రీఎద్దులతో దాటబడిపుట్టి వృద్ధి గాంచబడిగాని యుండవచ్చును. డెవన్, కెర్రీజాతుల మిశ్రమము వలన ఈజాతి కలిగినదని ప్రొఫెసర్ విల్సన్‌గారు చెప్పిరి.

### ఫ్రెంచి కెనడియన్ జాతి (Frenchkanathiyan)

ఫ్రాన్సునుంచి కెనడాకు వలసపోయివచ్చినపుడు తమతో పాటు ఫ్రెంచివారు కొన్నిఆవులను తీసికొనివచ్చిరి. వీటినే ఫ్రెంచి కెనడియన్ ఆవులందురు. మొన్నటివరకు వీనిలో కల్తీ చాలతక్కువ. కాని ఈమధ్య జెర్సీఆవులకును వీనికిని కల్తి జరిగినది. ఆకారములో జెర్సీఆవులవలెనుండును. ఇవి బూడిద రంగు, నలుపురంగుగ నుండును. వీనికి తగినంత మేతలేనప్పటికి తృప్తిపడునట. మిగుల చురుకుగానుండును. ఎటువంటి శీతోష్ణ స్థితినైనను సహించగలుగును.

### డార్జిలింగుజాతి (Darjeeling)

ఇవి ఇంగ్లీషుజాతివలెను, అడవిజాతిపశువులవలె కన్పించును. కొమ్ములు పొడవుగా నుండును. మూపుర మెత్తుగా నుండును. నలుపు, ఎరుపు, బటానీరంగుగా నుండును. దినమునకు నాలుగు శేర్లపాలనిచ్చును.

### సౌతుడెవన్ జాతి (South Devon)

ఈజాతికొన్ని, ఆకారములో పెద్దవై తెలికఎరుపురంగు గలవై డెవన్ జాతికి భేదించుచుండును. ఛానల్ దీవులలోనున్న తెలుపుఆవులను, ఆల్డర్నీస్ ఎద్దులతో దాటించెడివారు. అంతకుపూర్వము సౌతుడెవన్ జాతి యుండెడిది. కాని అంతకు పూర్వము జాతిని సౌతుహేమ్సుఅని పిలచెడివారు. 30 సంవత్సరముల క్రిందటివరకు ఈజాతిపశువులయెడ మంచి గౌరవ ముంచెడివారు. ఈ జాతిని దగ్గర దేశములకు అనగా దక్షి

ణాఫ్రికా, దక్షిణఅమెరికా, యునైటెడ్ స్టేట్సులకు పంపెడివారు. సంవత్సరములో తొమ్మిదివందలు లగాయతు వేయిగాలనుల వరకు పాలిచ్చెడివి. ఇతరజాతులపాలకంటె నీజాతిపాలెక్కువ ఖరీదుండును.

## వెల్షుబ్లాకుజాతి (Welsh Black)

ఈజాతి ఇతరజాతులను పోలియుండును. ఇది పురాతనమైనది. వేల్సులో నూరుసంవత్సరములక్రిందటివరకు ఈజాతికి సంబంధించిన అనేకరకములగు పశువులు యుండెడివి. కాని యిప్పటిలో రెండురకములు మాత్రముండి తదితరరకములు నశించెను. సౌతు వేల్సులో ఈ జాతులెక్కువగానుండి పాడి పరిశ్రమను వృద్ధిలోనికి తెచ్చినవి. ఈనిర్మాణము చాలగట్టితనము మంచికండగలిగియుండును. సామాన్యముగా అన్ని పనుల కుపయోగపడును. వీనిని కొని, అమ్మి లాభముపొందెడివారు. వీనిశవమును విలువగానెంచెడివారు. వీనిమాంసము మొదటిరకముగానెంచెడివారు. ఆవులు పాలు బాగాయిచ్చెడివి. ఇవి బరువులు లాగుటకు నెక్కువగా నుపయోగించెడివి. సౌతు ఆఫ్రికాకు పంపబడుచుండెడివి. శరీరము నలుపురంగుగను, పొదుగుభాగము నలుపుగను యుండెడివి. తెలుపురంగు గలవాటిని నాణ్యముచేసెడివారుకారు. వీనికొమ్ములు అన్నిటికి ఒకవిధముగానుండవు. వీనికొమ్ములు బలముగలవై బాగుగా పెరిగి ఆవులకొమ్ములకంటె ఎద్దులకొమ్ములు దృఢముగలవై యుండును.

## లాంగుహారన్‌జాతి (Longhorn)

ఇంగ్లండునకు పడమరభాగమునను, లీసెస్టరుషైరుప్రాంతములందును, ఈలాంగు హారన్ జాతియుండెడిది. రెండువందల

సంవత్సరముల క్రిందటివరకు ఈజాతి ఐర్లండులోనుండి తరువాత షార్త్హారన్ జాతివలన తరిమివేయబడినది. లాంకషైరులోను, యార్కుషైరులోను, కేవెన్ జిల్లాలోను ఈజాతి విశేషముగా నుండెడిది. డిష్‌లేకాపురస్థుడు రాబర్టు బెక్వెల్ వీనిని పోషించువారలలో ముఖ్యుడు. ఈజాతిలోని పశువులన్నియు ఆకారములో మార్పుగలిగియుండును. వ్యవసాయము చేయుటలో ఈజాతియెద్దులు ప్రసిద్ధిగాంచినవి. బేక్వెల్ 45 సంవత్సరములవరకు వీనిని శ్రద్ధగాపెంచి తగుఏర్పాట్లు చేసి అత నవలంబించినపద్ధతులను ఇతరులకు చెప్పనందున అతని రహస్యపు యేర్పాట్లు అతనితోనే అంతమొందెను. 19 వ శతాబ్దముమధ్యలో ఈ జాతి చాల నశించెను. వార్విక్ షైరు సెంటరులో నిప్పటికిని ఈ జాతిపశువులు 500 వందల వరకున్నవి. వీనికి కండ బాగుగానుండి ఇతరజాతులను మించియుండును. ఈ జాతి పాడిపరిశ్రమకుకూడ పేరుగాంచినది. వీని రంగు పండిన ద్రాక్షపండురంగువలె నుండును. వీపుమీాద తెలుపుచార యుండును. నిడుపులోను, కొమ్ములఆకారములోను, లాంగుహారన్ జాతికియున్న నలుపువెండ్రుకలవలనను షార్త్హారన్ జాతికి ఈ జాతికిగల భేదము స్పష్టముగా గాన్పించుచుండును.



# ప్రముఖులఅభిప్రాయములు

శ్రీరాములుచౌదరిగారి పశుసేవను గూర్చి చేయుచున్న కృషికి నేను మిక్కిలి సంతసించుచున్నాను. వీరు సామాన్యఆపరేషన్సు, ఔషధములిచ్చుట కూడ చేయుచున్నారు. అంటువ్యాధులవిషయమై రైతులకు బోధించుచున్నారు. నోరులేనిపశువులకు మిగుల కష్టించియు, మిక్కిలి యుత్సాహముతో సేవజేయుచున్నారు. ఎట్టి ప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) సి. వి. రత్నం,

కృష్ణా గుంటూరు జిల్లా వెటరినరీ ఆఫీసర్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన ఆయుర్వేదపశుచికిత్సాలయమును సందర్శించితిని. చికిత్సలవిషయమై చాల తృప్తికరముగా నున్నది. పశుసంరక్షణవిషయమై వీరు తీసికొనుచున్న శ్రద్ధ అపారము. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

(సం) కె. బి. నటేశయ్యరు,

జిల్లా పశువైద్యఆఫీసర్.

---

శ్రీరాములుగారి చికిత్సాలయమును చూచితిని. ఇది క్రమపద్ధతిని అభివృద్ధిజెందుచున్నది. మూగజీవులకు వీరొసంగురక్షణ మిగులప్రశంసనీయము. ఆయుర్వేదపశువైద్యగ్రంథములు వ్రాసి తత్సంబంధమైన వైద్యమును వీరు అభివృద్ధిపరచిరి. అన్ని ప్రాంతములవారు తగినసహాయము చేయుదురు గాక.

(సం) ఆర్. వీరాస్వామి,

వెటరినరీ అసిస్టెంటుసర్జన్.

---

చౌదరిగారు ఆయుర్వేదౌషధములచేతనే చికిత్సలు చేయుచున్నారు. పశువైద్యశాస్త్రమునందు అనుభవము పొందినవారై తదితరజిల్లాలనుండి రాబడిన విద్యార్థులకు బోధించుచున్నారు. ఈ సంవత్సరము గవర్నమెంటు వారిచే రిజిస్టరు చేయబడినందువలననే చాలమంది విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారని తెల్పుట సంతోషము. అంటువ్యాధులయందు కూడ వీరికి పరిచయము కలదు.

కె. యం. పేరనన్,
వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న నిఖిలాంధ్రాయుర్వేద పశువైద్యకళాశాలను, పశుచికిత్సాలయమును చూచి మేము చాలఆనంద పడుచున్నాము. కాలేజీలో చాలమందివిద్యార్థు లున్నారు. వీరిని ఆయుర్వేద పశువైద్యపద్ధతులమీద తర్ఫీతుచేయుచున్నారు. చౌదరిగారు చికిత్సలు చక్కగా చేయుచున్నారు. ఎట్టిప్రోత్సాహమునకైనను అర్హులు.

యన్. వి. శ్రీధరరావు,
వెటరినరీ సర్జన్, జి. యం. వి. సి.

యస్. శ్రీనివాసరావు,
మ్యునిసిపల్ వెటరినరీ అసిస్టెంటు సర్జన్.

---

చౌదరిగారిచే స్థాపింపబడిన చికిత్సాలయము చూచితిని. నవీనపద్ధతులతో నడిపింపబడుచూ నోరులేని వేలకొలదిజంతువుల్లను రక్షించుచున్న నూతనోద్యమము. ప్రశంసార్హమగు వారి యుద్యమము జయముగాంచుగాక.

కె. గురుమూర్తి,
అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటరు.

---

శ్రీరాములుచౌదరిగారిచే నడుపబడుచున్న పశుచికిత్సాలయమును, పశువైద్యకళాశాలను దర్శించితిమి. ఆంధ్రదేశములో నేగాక రాజధానిలో కూడ వేరొకసంస్థ లేదు. వీరిపట్టుదల, మేధాశక్తి అపూర్వము. ఇట్టి సంస్థలను ఆధారము చేసికొనినగాని గ్రామపునరుద్ధారణకు మనరాజకీయవేత్తలు పెద్దలు పడుశ్రమ పరిపూర్ణఫలమునొందదు. ఈ సంస్థ అన్నివిధముల అభివృద్ధిజెందుగాక అనికూడ అభిప్రాయము.

వి. బుధవేశ్వరరావు,
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్,
2 వ సర్కిల్, గుంటూరు.

యస్. శివరామపాత్రో,
అగ్రికల్చర్ ఆఫీసర్.

---

చౌదరిగారి కళాశాల, చికిత్సాలయములను చూచితిని. వారుచేయుచున్నపని చాల అత్యద్భుతముగానున్నది. గ్రామపునర్నిర్మాణమునకు దగినటుల ఈసంస్థలు పనిచేయుచున్నవి. వీరు దిగ్విజయమును పొందుదురుగాక.

చంద్రశేఖరం,
డిప్యూటీరిజిస్ట్రార్
కో-ఆపరేటివ్ సొసయిటీస్.

---

చౌదరిగారి చికిత్సాలయము పరిశీలించితిమి. పశుసంరక్షణవిషయమై చౌదరిగారు అనేకరీతులుగా చాల శ్రద్ధతీసికొనుచున్నందులకు మేమెంతయు సంతసించుచున్నాము.

డి. సదాశివరెడ్డి,
మద్రాసుప్రెసిడెన్సీ డిప్యూటీ ఎడ్యుకేషనల్ డైరెక్టర్.

యం. అబ్దుల్ఆలీ,
కృష్ణాజిల్లా ఎడ్యుకేషనల్ ఆఫీసర్.

---

ఆయుర్వేదపశువైద్యమునం దీమాత్రిపుకృషి మితుృడుసల్పుచుండు టెంతో ప్రీతికరమైనవిషయము. వీరొసగు పశువైద్యవాఙ్మయము ఆంధ్ర దేశమునకును, రైతునకును మిగుల ప్రయోజనమైనది.

బి. రామయ్య,
ఎ. డిమాన్‌స్ట్రేటర్.

---

ఆంధ్రదేశములో ఆయుర్వేద పశుచికిత్సాలయములుగాని, ఆయు ర్వేద పశువైద్య కళాశాలలుగాని సరియైన ఆయుర్వేద పశువైద్య గ్రంథ ములుగాని యింతవరకు లేవనియే చెప్పవచ్చును. ఇట్టి సమయములో "అభి నవ సహదేవ" శ్రీరాములు చౌదరిగారు పై సంస్థలను తన స్వయంకృషిచే వృద్ధిలోనికి తీసికొనివచ్చుచున్నందులకు ఆంధ్రదేశములోనున్న ప్రజలందరు గర్వింపతగిన విషయము. వీరి కాలేజికూడ చాల వృద్ధిలోనున్నది. స్థానిక సంస్థలుకూడ స్టయిపెండ్సుయిచ్చి విద్యార్థులను ఈ కాలేజికి పంపుచు న్నారనిన ఆంధ్రదేశమున కెంతలాభముగలదో చదువరులే గ్రహించుదురు గాక. ఇంకను తరగతులవారీగా 20 పశువైద్యగ్రంథములువ్రాసినారంటే ఎంతగొప్పమేధావంతులో పాఠకులే గ్రహించుదురుగాక. వీరి గ్రంథ ములు త్వరలో అప్రూవ్ చేయించి అన్నిపాఠశాలలలోను పెట్టించిన చాల ఉపయోగకరముగానుండును. నూతనముగావచ్చిన కాంగ్రెసుమంత్రులు ఈ కళాశాలను రికగ్నయిజు చేయించి అన్ని ఫిర్కాలలోను ఈ ఆయు ర్వేద పశువైద్యమును వ్యాపింపజేయగలరని నా నమ్మిక.

ఎ. వి. రామలింగపాట్నాయక్,
యం. బి. బి. యస్.

---

డాక్టరుగారి స్వగృహమున ఒక పెద్దహాలులో పశుచికిత్సాలయము స్థాపించబడి వివిధపరికరములచే సమకూర్చబడియున్నది. పేదలనక భాగ్య వంతులనక అందరికి నుచితముగా చికిత్సలుచేయు ఇట్టి సంస్థ మరెచ్చటను లేదు. ఔషధములు తయారుచేయుటయేగాక డాక్టర్‌గారు పశురోగము లను, దేహతత్వములను బోధపరచుటకు అనేకపటములు, చిత్రపటములు కూడ తయారుచేసినారు. పశువైద్యశాస్త్రమునందు శిక్షను గలుపుటకై

ఆయుర్వేద పశువైద్యకళాశాలను గూడ వీరు నడుపుచున్నారు. ఈ సంస్థ యెంత ప్రజాదరణమును బడసినదో ఇతర జిల్లాలనుండి ఈ కళాశాలలో జేరుటకు వచ్చినవారివలన తెలియుచున్నది. పదునొకండవ కమ్మ మహాజన సభయందు చౌదరిగారి సేవకై మెచ్చి వారిని "అభినవసహదేవ" అను బిరుదముచే బహూకరించిరి. ఈ బిరుదమునకు వీరెంతయు అర్హులు. వీరు పశువైద్యమునందు చేసిన కృషి, సేవయు, మంత్రులు, జిల్లాబోర్డు అధ్యక్షులు, గవర్నమెంటు పశువైద్య ఉద్యోగస్థులు, పెద్దపెద్ద భూస్వాములు మున్నగువారిచేత పొగడ్తగాంచినవి. పశువైద్యమునందు పురాతనపద్ధతులన్నియు మార్చి ఆధునికపద్ధతులపై వైద్యముచేయు ఇట్టి డాక్టరుగారుండుట మనమెంతయు గర్వించవలసిన విషయము.

చౌదరిగారి గ్రంథములను, ప్రతిగ్రామ పాఠశాల పుస్తకభాండాగారమునకు, ప్రతిఆయుర్వేద చికిత్సాలయమునకు సప్లయిచేయుటవలన స్థానికసంస్థలుచేయు అమూల్యసేవకు మేరలేదని మదరాసు శాసనసభాధ్యక్షులగు గౌ॥ బి॥ రామచంద్రారెడ్డిగారు వెల్లడించిన అభిప్రాయముతో నేను పూర్తిగా ఏకీభవింతును. చౌదరిగారి ఉత్కృష్టసేవకై వారి నభినందించుచు వారి సంస్థాభ్యుదయమునకై నేను కోరుచున్నాను.

వి. సత్యనారాయణ,
తహశ్శీల్దారు, గుడివాడ.

---

ఈ చికిత్సాలయము నెంత ప్రోత్సహించిన అంతమేలు. ఆధునిక పద్ధతులతో నడుపబడుచున్నది. అంటువ్యాధుల నివారింపగలశక్తి ఈ చికిత్సాలయమునందు గలదు. ఈసంస్థ జయప్రదముగా సాగుగాక.

శ్రీ రాజారావు,
తహశ్శీల్దారు, గుడివాడ.

---

6 69



నేడుదయమున అంగలూరులో నెలకొల్పబడిన ఆయుర్వేద పశు చికిత్సాలయమును చూడగలిగినందులకు చాల ఆనందించుచున్నాను. ఈ సంస్థవిషయమై చౌదరిగారు చాల శ్రద్ధవహించుచున్నారు. వీరి పరిశ్రమ ఫలించి యీ సంస్థ మరికొన్నిటికి ఆదర్శప్రాయమై చిరస్థాయిగా వెలయుచు లోకల్ బోర్డులయొక్కయు, భూస్వాములయొక్కయు సహాయమునకు ప్రథమార్హమై యుండును.

యన్. నరసింహరాజు,
తహశ్శీల్ దారు, గుడివాడ.

---

శ్రీరాములుచౌదరిగారు మూగజీవులకు ఆయుర్వేద పద్ధతులతో చికిత్స చేయుచున్నందులకు సంతోషించుచున్నాను. కొందరు విద్యార్థులు వారు స్థాపించిన పాఠశాలలో తర్ఫీయదగుచున్నారు. త్వరలో గవర్నమెంటువారు రికగ్నయిజు చేయుట మంచిది.

సి. హెచ్. వెంకటేశం,
డిప్యూటీ యిన్ స్పెక్టరు ఆఫ్ స్కూల్సు.

---

రైతులక్షేమమునకై, వారిపాడిపంటలవృద్ధికై వారి గడపలపనిమికై, వారి స్త్రీలహృదయవికాసమునకై యుపయోగపడు ఈ పశువైద్యచింతామణిని తుద కిప్పటికైనను మన చౌదరిగారు ఈ రూపముగా నిచ్చినందులకు సంతసము.

ప్రొఫెసర్, జి. రంగనాయకులు,
బి. లిట్. (ఆక్సుఫర్డు), యం. యల్. ఎ.

---

శ్రీరాములుచౌదరిగారు ఆదర్శప్రాయమగు వైద్యశాలను స్థాపించి స్వయముగ నెల్లరకు దగు అనుభవముల విశదపఱచి ఆంధ్రదేశమున కొదర్యకు డాయె ననుటలో నతిశయోక్తి లేదు.

కల్లూరి చంద్రమౌళి,
బి. యస్, సి. (వ్యవ), బర్గిన్, యం. యల్. ఏ.

---

70



శ్రీకృష్ణాజిల్లాబోర్డువారు యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థకు రు 500-0-0 విరాళమొసంగుట చాలసంతోషమైన విషయము. ఈవిరాళము ప్రతిసంవత్సరము నొసంగబడునని నేను తలంచెదను. గవర్నమెంటువారు యిటువంటి సంస్థలకు యెల్లకాలము కొంత ధనసహాయమును చేయుట చాలసమంజసము. ఈసంస్థ జయప్రదముగా సాగుచుండుగాక.

పి. వి. నారాయణ,
డెలిగేటు ప్రెసిడెంటు, కృష్ణాజిల్లాబోర్డు.

---

రైతాభ్యుదయముకొరకు స్థాపించిన పశుచికిత్సాలయమును గూర్చియు వారినిర్మలత్వమును, నిష్పాక్షికత్వమును గూర్చియు వచించుటకు, గుణగ్రహణము చేయుటకు నెంతయు ఆనందించుచున్నాను. వీరు నడుపుచున్న పశువైద్యశాల కడుశుభ్రముగ నున్నది. మందులకొదువయుండదు. వారి వైద్యశాల రిజిస్టరు వారియున్న పలుకుబడిని, ప్రతిదినము వ్యాధినివారణార్థము వచ్చు పశువులసంఖ్యను, స్పష్టముగా సూచించుచున్నది.

వర్జూర్ ఆరేషమ్,
జిల్లా ఆరోగ్య శాఖాధికారి.

---

ఆయుర్వేదశాస్త్రపద్ధతిని శ్రీ చౌదరిగారు పశువులకు చేయుచున్న సేవ ప్రశంసనీయము. ప్రభుత్వమువారును స్థానికసంస్థలును సర్వవిధముల సహాయపడి యీఉద్యమమును ప్రోత్సహించుట ఆవసరము. అందుకు ఈచికిత్సాలయము అర్హతపొందినది. సర్వేశ్వరుడున్ను ఆశీర్వదించుగాక.

తుర్లపాటి వెంకటేశ్వరరావు,
బారిష్టర్, జిల్లాబోర్డుమెంబరు.

వి. కనకబాపయ్య,
అడ్వకేటు.

వి. రామకోటయ్య,
బి. ఎ., బి. యల్.

---

71



## లింగం వీరభద్రయ్యగారు, బి. ఏ. (ఆక్సుఫర్డు) బ్యారిష్టర్.

మనదేశము వ్యవసాయముమీద చాలవర కాధారపడియున్నది. రైతులకు పశువులుమూలము. కొన్ని సంవత్సరములనుండి వ్యవసాయమున కాధారభూతమైన పశువులను తగినట్లుగ పోషించుటయు జరుగుటలేదు. శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు పశువుల సంరక్షణకు తగిన విద్యను సంపాదించి పుస్తకములరూపమునను తమ వైద్యశాల మూలమునను రైతులకు సాయపడుచుండుట మిక్కిలి ప్రశంసాపాత్రము. రైతుబిడ్డలగు వీరు రైతునకు ప్రాణాధారమువంటి పశువుల సంరక్షణకు పూనుకొనుట మిక్కిలి సమంజసము. వీరి పరిశ్రమ అభివృద్ధిలోనికి వచ్చుగాక యని ఆశపడుచున్నాను.

---

## యస్. నరసింహారావుపంతులుగారు, డిప్యూటి యిన్స్పెక్టరు, గుడివాడ రేంజి.

నేను శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారి ఆయుర్వేద పశువైద్యశాలను, వారిచే రచియింపబడిన పలు పశువైద్యగ్రంథములను చూచితిని. వీరు అనుభవ వైద్యముచేతనే యింత యున్నతదశకు రాగలిగిరి. వీరు చేయుపని, కృషి, సేవ యెంతయు నుపయోగార్థమైనవి. ప్రశంసార్హము. వీరికృషి నిర్విఘ్నముగా జయప్రదముగా ఫలించుగాకయని నమ్ముచున్నాను.

---

శ్రీ శ్రీ శ్రీ రాజా యం. వి. అప్పారావుబహద్దరు ఉయ్యూరు జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ రాజా శివరామప్రసాద్ బహద్దర్ చల్లపల్లి జమీందారుగారును, శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్నారాయణ అప్పారావు బహద్దరు గొల్లపల్లి జమీందారుగారును

ఈవిధముగా తెలిపిరి.

మేమున్ను తదితర పెద్దమనుష్యులును కలిసి యీ ఆయుర్వేద పశు చికిత్సాలయ సంస్థను పరిశీలించితిమి. డాక్టరు శ్రీరాములుగారి ప్రయత్న మెంతయు పొగడదగియున్నది. డాక్టరుగారు మిగుల శేముషీ ధురంధరులు. వీరు నిజముగ నీ విషయమునందు జయము పొందుదురని మా యాశయము.

---

యం. నరసింహారావుగారు, కృష్ణాజిల్లాబోర్డు ఎడ్యుకేషనల్ ప్రెసిడెంటు, జిల్లాబోర్డు మెంబరు.

డాక్టరు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారిచే స్థాపింపబడి పోషింపబడుచున్న పశుచికిత్సాలయమును సందర్శించితిని. ఈ సంస్థతరఫున శ్రీరాములుగారిచే ప్రచురింపబడు గ్రంథములు కృషీవలుల కెంతో యుపయుక్తమైయున్నవి. డాక్టరుగారి సహజమగు బుద్ధికుశలతయును, స్వానుభవమును వారిని మిగుల జనసమ్మతునిగా నొనరించినవి. జిల్లా తాలూకా బోర్డుల సహాయమునను జనాదరణమునను వారి పశుచికిత్సాలయ సంస్థ యభివృద్ధిలోనికి రాగలదు.

---

శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారు "అనుభవ పశువైద్య చింతామణి" యను గ్రంథమును రచించి వైద్యవాఙ్మయమునకే కాక ఆంధ్రదేశములోని రయితు సముదాయమున కత్యంతమగు మేలొనగూర్చిరి. కలకాలము ప్రేమపూరితమైన కృతజ్ఞతా పాశములతో రయితువర్గమును గట్టివైచుకొనిరి. అనుభవమువలన సంపాదించిన జ్ఞానమును వారు కొంతకాలముగ వార్తాపత్రికల మూలమునను, ఇంతకుపూర్వమే వెలువడిన కొన్ని గ్రంథముల మూలమునను ప్రచురపరచిరి. పశుచికిత్సయందు వీరి కెంత యభిలాషకలదో, రయితులకా జ్ఞానమును బోధించుటయను, అంత యుత్సాహము కల దనుటకు ఈ గ్రంథరచనప్రచురణములవలన గల్గిన శాశ్వతోపయోగమే తార్కాణము. గ్రంథముయొక్క ప్రాశస్త్యము, ఉపయోగము పరికించినంతటనే విదితమగును.

అచ్చటచ్చట గ్రామవాసులలో నుండిన పశు చికిత్సకులు పూర్వాచారములవలన గలిగిన మౌఢ్యముచేత స్వకీయానుభవ విజ్ఞానమును లోకమున కుపయుక్తమగురూపమున శాశ్వత మొనర్పక ఆత్మకుటుంబపోషణమే పరమార్థముగా నెంచి, అర్థసంగ్రహణమే విజ్ఞానసంపాదనమునకు పర్యవసానమని తలంచి, తద్విజ్ఞానమును గుప్తపఱచి మరణించుటచే, అనేక చికిత్సకుల యనుభవలాభము భరతఖండమునకు మఱుగైపోయెను. అట్టి యనుభవమును గ్రంథస్థ మొనర్చుటకు వలయు భాషాపరిచయాభావమువలన కొందఱి జ్ఞానము నిరుపయోగమై శైథిల్యమునుబొందెను.

మన దేశమున పశుగణ మెక్కుడుగా గలదు. రయితులసంఖ్యయు చాల గలదు. ఒక చికిత్సకుని స్వయముగ పోషింపగల పశుగణమును పెంచెడి పెద్దరయితు లెవ్వరును గానరారు. ఒకటి రెండెద్దులను గలిగిన రయితుల సంఖ్యయే యెక్కువగా గలదు. అట్టివారు తమ పశువులకు ధర్మ చికిత్స చేయించుకొనగలవారలేగాని ద్రవ్యమొసంగి వైద్యుని పోషణమునకు దోడ్పడువా రరుదు. విపరీతమైన వెలలకు పశువులను కొనుటకు వాడుకపడినట్లు, కొన్నిరూకలిచ్చి వానికి చికిత్స చేయించుకొనుట కింకను రయితులు చక్కగనలవాటు పడలేదు. అదియును గాక ప్రభుత్వమువారిచే నియమింపబడిన "వెటరినరీ" వైద్యుల సంఖ్య మిక్కిలి కొంచెముగా

నుండుటచే వారి వలన నుపయోగము రయితుల కందరికిని అందుబాటులో లేదు. ఉన్నచోటులందును అట్టి వైద్యమునకు ప్రోత్సాహము కలుగ కున్నది. "వెటరినరీ" వైద్యము కేవలము హైందవపద్ధతికి విరోధమయిన దనియు, అందువలన నిరుపయోగ మయినదనియు ననేకులకు భ్రమ యింకను గలదు.

ఈ పరిస్థితులను చక్కబఱచుటకు గాబోలు ఆంధ్రరయితు లెక్కువగా లాభపడుటకో యన శ్రీరాములు చౌదరిగారిని శ్రీరామచంద్రుడీ గ్రంథరచనకు బ్రోత్సాహపరచెను. ఈ గ్రంథము యొక్క యుపయోగము త్వరలో నాంధ్రదేశమునకు ఆంధ్రరయితునకు వ్యక్తపడుననుట నిస్సందేహము. ఇయ్యది ప్రతి రయితువద్ద నుండతగినది. ప్రతి గ్రామపాఠశాల పుస్తక భాండాగారములోనుండి స్థానికసంఘములు రయితుసంఘమునకు దోడ్పడుట యవసరము. ప్రతి గ్రామోద్యోగి కార్యస్థానమునందు చౌదరిగారి గ్రంథముల నుంచి రయితులు కోరినప్పుడు చదువుకొనుట కను వేర్పరచినచో ప్రభుత్వమువారును రయితుల కృతజ్ఞతకు బాత్రు లయ్యెదరు.

ప్రతి ధర్మాయుర్వేద వైద్యశాలకును స్థానికసంఘము లీ గ్రంథములను సరఫరాచేయుట యుచితము. చౌదరిగారిప్రయత్నమునకు ఫలము రయితు లందరకు ఈ గ్రంథము అందుబాటులో నుండుటయే. వారి గ్రంథములను గల గ్రామ గ్రంథాలయములు రయితులకు మఱింత యుపయోగకారులుగ నుండగలవు.

శ్రీయుత శ్రీరాములుచౌదరిగారికి ఆయురారోగ్యములను దైవము ప్రసాదించి యింక నిట్టి యనుభవచికిత్స గ్రంథములను రచించుటకు ధీసంపదలను గల్గించి దీవించుగాత.

మద్రాసు. } బెజవాడ రామచంద్రారెడ్డి, బి. ఏ.,
యక్సుప్రెసిడెంటు, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలరు

---

78



## శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ జమీందారుగారు, యం. యల్. ఏ., చల్లపల్లి రాజావారు, కృష్ణాజిల్లాబోర్డు ప్రెసిడెంటు.

### పశుసంరక్షణ.

పశుసంతతిని రక్షించుట సాధారణమైన పనిగాదు పసిబిడ్డలవలెనే నోరులేని పశువులకష్టములనుగూడ వేయికండ్లతో విచారించి కాపాడుకొనవలయును. దానిలో ప్రభుత్వమున కెంతయో బాధ్యతకలదు. ప్రభుత్వమువారుగూడ పశువైద్యాలయములను స్థాపించి రైతులకు సాహాయము చేయుచున్నారు. కాని ఆ వైద్యసహాయ్యము చాలక రైతులు పల్లెటూళ్ళలో చేయబడుచున్న రాక్షసవైద్యముతో తృప్తిపడుచున్నారు. ఈ పద్ధతిని మాన్పించి మానవులవలెనే పశువులనుగూడ సక్రమవైద్యమున సంరక్షించుట ప్రభుత్వమునకును, ప్రజలకును ధర్మమై యున్నది.

### శ్రీరాములుచౌదరిగారి కృషి.

ఈ సత్కార్యమునకు శ్రీయుతులు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు ముందంజ వేయుట మెచ్చుకొనదగియున్నది. పశువైద్యము వంశపరంపరగా వారికి వచ్చినధనము. వ్యక్తిగతముగా చేయుచున్న వైద్యసాహాయ్యమే గాక ప్రత్యేకముగా నీ వైద్యశాలను స్థాపించి తద్వారా వారు కావించిన సేవ అపారము. ఈచికిత్సాలయ ప్రయోజనముల గమనించియే కృష్ణాజిల్లాబోర్డువారు దీనికి కొంతగ్రాంటును మంజూరు చేసియుండిరి. ఈవైద్యాలయము ప్రారంభింపబడినది మొదలు నేటివరకు జరిపిన సేవను పెక్కురు శాస్త్రవేత్తలు, ప్రభుత్వోద్యోగులు మెచ్చుకొనియున్నారు. ఇచట ఆయుర్వేద చికిత్సయేగాక ఆంగ్లేయవైద్యమును, శస్త్రచికిత్సయు గూడ చేయబడుట గమనింపతగియున్నది. అందువలన రైతులందరు నీవైద్యాలయమును శ్రద్ధగా పోషించుకొనవలయును. మరియును ఇట్టి వైద్యాలయములు ఫిర్కాకొకటిచొప్పున, అధమపక్షము

...వను స్థాపించుకొని దానివలన తమ పశుగణ
...ది.

...ము సాహాయ్యముగా ప్రారంభింపబడి నేడొక
...గా తయారయిన యీ ఆయుర్వేద పశుచికిత్సాలయము
...త్వముల ఆదరణమును బడసి ఇంతకంటెను మహత్తరముగా రైతు
...డుగలదని ఆశించుచూ విరమించుచున్నాను.

---

...ౘ యేజెళ్ళ శ్రీరాములుగారు చేయుచున్న పనిని, వారికళాశాలను ...మితానందము పొందిని. ఏ వైద్యకళాలలోనూ చదువక పెద్దగ్రం... చదువుటకు కావలసినంత సామాన్యవిద్యను పాఠశాలలో చదు... స్వయంకృషివలన యింతవిద్యను గడించుట సామాన్యమైన పనిగాదు. ...విద్యను సంపాదించుటయేగాక దానిని మరలపల్లెలలో విశేష విద్యావంతులుగాని యువకులను చేరదీసి తమవలెనే వారినిగూడ తయారుచేయనెంచుట స్తోత్రార్హమైనపని. అందులోను నోరులేని పశువులకు సేవచేయనెంచుటకంటె వుత్తమమైన కార్యము మరొకటిలేదని నాయుద్దేశము. వారి జీవితమునుండి వారుచేయుచున్న పనినుండి సామాన్యజనులు గుణపాఠమును నేర్చుకొనుటయేగాక ప్రభుత్వముగూడ విద్యావిధానమును తయారు చేయుటలోకూడ వీరినుండి నేర్చుకొనవలసినది చాలయున్నదని నొక్కి చెప్పవచ్చును. ఈశ్వరుడు వారికృషికి సర్వవిధముల తోడ్పడుగాక యని కోరెదను.

తల్లాప్రగడ నరసింహశర్మ,
ఆనంద నికేతనం, చాగల్లు ఆశ్రమము, ప. గోదావరిజిల్లా.

---

శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుగా
మును చూచితిని. వీ రీపాఠశాలను నా
చుండిరి. వీరి విద్యార్థులు పలుతావుల వైద్యా
నీయముగ పశుచికిత్సలు చేయుచుండిరి. పశుపోష
ములతో మాత్రం ప్రొద్దుపుచ్చుచు తగినంతగ పశువైద్య
ప్రభుత్వమువారు చేయుటలేదను సంగతులు నిర్వివాదమై
లోటును పూర్తిచేయుటకు శ్రీ చౌదరిగారు ప్రయత్నించు
నేను వారిని ప్రశంసించుచున్నాను. యీ విద్యాలయమున
చెందిన విద్యార్థులచే వైద్యాలయముల నేర్పాటుచేసి తగిన
మును చేయ ఆంధ్రులను హెచ్చరించుచున్నాను.

గొట్టిపాటి బ్రహ్మయ్య
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్య

---

శ్రీయుత యేజెళ్ల శ్రీరాములుగారిచే నడుపబడుచుండిన ఆయుర్వేద
వెటరినరీ డిస్పెన్సరీని గాంచి ముదంబందితిని. అనేక పశురోగములన
కుదుర్చుచు శ్రీరాములుచౌదరిగారు ఖ్యాతివహించి యుండిరి. వీరు పశ
వులపాలిట దైవమని చెప్పవచ్చును. వీరు పశువ్యాధులను గూర్చియు
వాటినినివారణ మార్గములను గూర్చియు, పత్రికలకు వ్యాసముల
వ్రాయుచు, తద్వారా పశుచికిత్సామార్గములను లోకులకు వెల్లడిచేయుచ
దేశోపకారులగుచున్నారు. యీ వైద్యము తమలోనే యంత మొందకుం
దేశమున విరివిగ వ్యాపించులాగున పాఠశాల నొకదానిని సాగించుచు
విద్యార్థులనుగూడ నీ విద్యయందు తయారుచేయుచు, నీ వైద్యమును నల
దెసల వ్యాపింపజేయు తలంపుగలిగి చక్కని కృషి చేయుచున్నారు. పైగ
నీ వైద్యమును గురించి పెక్కుగ్రంథముల రచించియుండిరి. వీరి యుద్య
మములన్నిటికి జయమును గోరుచు, జయమొందంగ భగవంతుని ప్రార్థించ
చున్నాను.

కొడాలి శివరామకృష్ణారావు,
ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B115 |
| పుస్తకం పేరు | పశుజాతులు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | C |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |